- యుద్ధం చేయడానికి ఆయుధాలు మాత్రమే సరిపోవు - ఆయుధాలు పట్టినవాళ్ళందరూ.... యుద్ధాలు చేయరు!
- నిన్నటి అవమానమే... నేటి పోరాటానికి పునాది!
- తమ మనుగడకై చేస్తున్న పోరాటంలో స్వాభిమానులకి తగిలిన గాయాలే - గేయాలై... ఈ పుస్తకరూపంలో మీ ముందు నిలిచాయి!



# గాయాలే...గేయాలై!

తెలంగాణ కవయిత్రుల కవితా సంకలనం

# గాయాలే... గేయాలై!

తెలంగాణా కవయిత్రుల కవితా సంకలనం

సంపాదకులు :
రాజీవ, జ్వలిత, అమృతలత

రజనీ పబ్లికేషన్స్,
ఆర్.టీ.సీ. కాంప్లెక్స్,
నిజామాబాదు - 503 003.

# GAAYAALE... GEYAALAI!

A collection of poems

**FIRST EDITION:**
May, 2010. (1000 copies)

**EDITORS:**
Rajeeva, Jwalitha, Amrutha Latha

**ILLUSTRATIONS:**
Babu

**COMPUTER DESIGNING:**
M. Kalyan Bahadur

**For Copies:**
Keerthi Book Stall, Nizamabad - 503 003.
Vishalandhra Book House, Bank Street, Hyderabad.
Navodaya Book House, Kachiguda, Hyderabad.
Prajashakti Book House, Chikkadpalli, Hyderabad.

**Price :**
**Rs. 80/-**

**PUBLISHER:**
Rajani Publications,
Keerthi Book Stall,
Shop No. 12, RTC Complex,
Nizamabad - 503 003.

## విషయ సూచిక



ఏ పేజీలో ఏ కవిత....

# తెలంగాణ అస్తిత్వవేదనలో స్త్రీల గొంతులు!



- ముదిగంటి సుజాతారెడ్డి
ఫోన్: 040-27566534

ఇవి స్త్రీల గొంతులు. కవయిత్రుల ఆవేదన. అస్తిత్వ వేదన. ఇంతకుముందు 'పొక్కిలి', 'మత్తడి' వచ్చాయి. వాటిల్లో కవయిత్రులకు ఎక్కువ స్థానం దొరకలేదు. ఇప్పుడు ప్రత్యేకంగా స్త్రీల మనోభావాల అభివ్యక్తితో ఈ 'గాయాలే... గేయాలై!' కవితల సంకలనం వచ్చింది. దీనిలో అరవై మంది కవయిత్రుల కవితలున్నాయి. అన్నిట్లో వస్తువు ఒక్కటే. తెలంగాణ మీద అభిమానం. 'తెలంగాణ మాది మాకు కావాల'నే తపన! ఆక్రోశం!

కవయిత్రుల అభివ్యక్తి కవుల అభివ్యక్తికి ఏమీ తీసిపోలేదు. ఎక్కడా సంకోచంగాని, న్యూనతాభావం గాని లేకుండా కవయిత్రులు ధైర్యంగా తమ గళాలను విప్పి తమ ఆకాంక్షలను వ్యక్తం చేసారు. కొన్ని కవితలు వచన కవితలైతే కొన్ని పాటల రూపంలో, గేయాల రూపంలో వున్నాయి. ఈ కవయిత్రుల్లో అందరూ కొత్తగా తమ గొంతులనెత్తినవారు కాదు. ఇంతకు ముందే కవయిత్రులుగా ప్రసిద్ధి చెందిన అనిశెట్టి రజిత, కొలిపాక శోభ, తుర్లపాటి లక్ష్మి, జ్వలిత, శిలాలోలిత, నెల్లుట్ల రమాదేవి, కొండెపూడి నిర్మల మొదలైనవారున్నారు. రచయిత్రులుగా స్థిరపడిన గీతాంజలి, జూపాక సుభద్రలు వున్నారు. అధ్యాపకులుగా, పరిశోధకులుగా పేరుబోయిన డా॥ త్రివేణి, డా॥ తిరునగరి దేవకీదేవి వున్నారు. ఎన్నో సాహిత్య రంగాల్లో, ప్రక్రియల్లో కృషి చేసిన స్త్రీలు తమ కవితల్లో ఈ 'గాయాలే... గేయాలై!' సంకలనంలో తెలంగాణ సాధించవలసిన అవసరాన్ని బలమైన గొంతుతో వినిపించారు.

వసంతా వివేక్ 'అంత అది -ఇంత ఇది' చమత్కారపూర్ణమైన కవిత

'నాది గొంతెండి పోతున్న నా పిల్లలదని -
నీది కడుపులోని చల్ల కదలని నీ పిల్లలదని...'

అని తెలంగాణలో నీళ్ళు లేని బాధను వ్యక్తం చేస్తూ

'అవి రెండు వేర్వేరనీ

ఆ రెండూ ఎప్పుడూ 'ఒకటి' కావని...'

తెలంగాణను కోరుతూ తన మనస్సులోని మాటను కవితలో అభివ్యక్తీకరించారు.

తెలంగాణను అణకువగల అమ్మాయికి ప్రతీకగా తీసుకొని

'ఆగ్రహంగల అతను అణకువగల నన్ను వివాహమాడాడు...'

కాని - 'అణకువ వలన ఆవేదనే తప్ప

ఆశయం ఆకాంక్ష నెరవేరదని'

'అణకువగల అమ్మాయి' కవితలో సుజని అన్నారు.

1956 నవంబరు ఒకటవ తేదీనాడు ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవంలో ఉపన్యసిస్తూ అప్పటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 'తెలంగాణ ఒక అమాయక మైన అమ్మాయి. ఆమెకు పోకిరివాడయిన పడుచువాడితో పెండ్లి అవుతుంది. ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు వాళ్ళు విడిపోవచ్చు' - అన్నాడట. కవులెందరో 'తెలంగాణ ఆంధ్ర' - అనుబంధాన్ని భార్యాభర్తల అనుబంధంగా వర్ణించి కవితలు వ్రాసారు. సుజని కూడా ఈ కవితలో తెలంగాణను అణకువ గల అమ్మాయిగా చిత్రించి ఆమె అనుభవించిన అత్తింటి పోరును 'తెలంగాణ వేదన'గా స్ఫురింపజేసింది తన కవితలో. అన్యోక్తులతో కవిత రక్తికట్టించారు.

'అభివృద్ధి మయసభలో తెలంగాణ' రేపల్లె అల కవిత దీర్ఘమైనది. రేపల్లె అల రియలెస్టేట్ వ్యాపారం, సెజుల తతంగం, సాఫ్ట్‌వేర్ బూమ్, భూకబ్జాలు, కార్పోరేట్ విద్యాలయాలు వంటి అభివృద్ధి పేరుతో జరిగిన మాయంజాలాన్ని ఎత్తి చూపారు. కమిటీ ఒప్పందాలు జీవోల ఉల్లంఘనలను ప్రస్తావించారు. ఇటువంటి మాయల మయసభను నిరసించారు.

'సమ్మిళిత సంస్కృతి పునరుజ్జీవనం తెలంగాణ

మరుగున పెట్టిన చరిత్ర జ్ఞాపకానికి తెలంగాణ'

'అవసరం' అని షహనాజ్ ఫాతిమా ఆదేశంగా వ్యక్తం చేసారు.



అనిశెట్టి రజిత కీ.శే పాకాల యశోదారెడ్డి మీద కవిత 'ఆత్మగల తల్లి' వ్రాసారు.

'తెలంగాణా భాషా సాంస్కృతిక పతాకం నీవు...'

అని యశోదారెడ్డి వ్యక్తిత్వాన్ని అంతా ఒక పాదంలో వ్యక్తం చేసారు రజిత.

మొన్నటి తెలంగాణా వేర్పాటు ఉద్యమంలో బలియైన విద్యార్థుల మాటలుగా ఈ కవితను వ్రాసారు. 'సొంత గూటికోసం మేము రాజేసిన నిప్పుని... / మీరు డబ్బు సంచులందగానే ఆర్పేసారు నిస్సిగ్గుగా!' అంటూ తెలంగాణా నాయకులను ఘాటుగా విమర్శించింది. 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఒక్కటే - మాకు విముక్తినిచ్చేదీ - మా ఆత్మలకు శాంతినిచ్చేది!' అని విద్యార్థులు ఆత్మఘోషను వ్యక్తీకరించారు.

ఈ కవితల సంకలనంలో 'తెలంగాణ ఆకాంక్ష'నే కాదు తెలంగాణ 'సంస్కృతి, వంటలు, కుట్లు, అల్లికల...' ప్రత్యేకత మీద అభిమానం, గర్వం కన్పిస్తుంది. వసంత సుబ్రమణ్యం వ్రాసిన 'ఆనాటి అందాలు'లో తెలంగాణ సంస్కృతినే కాదు ఇప్పుడు వస్తున్న 'ప్లాస్టిక్' వైకృతి మీద నిరసన కన్పిస్తుంది.

'ఆరోజుల కోసం'లో తెలంగాణా ఉద్యమంలో ఈ మధ్య ఆత్మబలిదానం చేసుకున్న యువకులను సంబోధిస్తూ 'ఉద్వేగ పడకండి- చావు కోసం చేసే ఈ తెగింపు... బ్రతుకు కోసం చేస్తామని ఒట్టేయండి! మన బ్రతుకులు మనల్ని ఎట్లా బ్రతకనివ్వరో... బతికుండీ తేల్చుకుందాం రండి!' అని కిరణ్‌బాల పిలుపునిచ్చారు.

కవయిత్రి తెన్నేటి సుధ పరిశోధకురాలు. మంచి వక్త. తన 'ఉద్యమం ఉప్పెనగా లేస్తే' కవితలో స్త్రీవాద భావాలను వ్యక్తీకరించారు. 'వ్యత్యాసం రూపుమాసి మనుషులమయ్యే వరకు మేం ఉద్యమిస్తాం.' అని వివక్షత తొలిగేంత వరకు అవిశ్రాంతంగా శ్రమిస్తామన్నారు.

పి. సుజాత 'ఇక తెగతెంపులే...' 'తెగేదాకా తెలంగాణాని లాగింది మీరే...' అని ప్రాంతీయ ఆధిపత్యం, ఆక్షేపణలు, వెక్కిరింతలు తెలంగాణ వేర్పాటు వాదానికి కారణాలని తేల్చేసారు. 'ఇక తెగతెంపులు తప్పవు మరి!' అన్నారు ఆగ్రహంతో.

'మాది... ఎక్కాలు చదివే వయసు కాదు

లెక్కలు వేస్తున్నాం

ఈ లెక్కన... మీరే మాకు బాకీ పడ్డారు

ఇంతకాలం పీల్చి పిప్పి చేసింది చాలు!'

అంటారు సుజాత కమిటీలు వేసి లెక్కలు కట్టడాన్ని ఎద్దేవా చేస్తూ.

'ఎదురు చూస్తూ' కవితలో స్వాతి శ్రీపాద 'కొత్త లోకం రూపు దిద్దుకుంటోందా...' అనే ఆశలో ఎదురు చూస్తున్న వైనాన్ని వర్ణించారు.

నిర్మల ఆంజనేయులు 'తెలంగాణ తల్లి'ని 'ఎవరమ్మా!?' కవితలో రూపుకట్టించారు.

సుజాత ముదిరాజ్ కొత్తగా కలం పట్టి 'ఏకాభిప్రాయం' కవిత వ్రాసారు. పట్నాల్లోనే కాదు మారుమూల పల్లెల్లోనూ - 'తెలంగాణ మాది మాదేనని ఏకాభిప్రాయంలో నినదించారు.' అన్నారు సుజాత .

తమ్మెర రాధిక 'ఏది నా తెలంగాన'లో పాత వ్యవసాయ వైభవాన్ని, సంపదలను తలచుకొని తన వ్యథను వ్యక్తం చేసారు.

'ఒంటె - ఓనరు' కవితలో కవితా దివాకర్ యజమానిని బయటకి పంపిన ఒంటె కథను గుర్తుచేస్తూ

'మా ఇంటిని మేం స్వాధీనం చేసుకుంటాం' అన్నారు.

'ఒక్క పోరాటం... వేలవేల గాయాలు' వ్రాసింది శైలజా మిత్ర. ఆమె ప్రసిద్ధ కవయిత్రి. 'తెలంగాణ కొత్త చరిత్రను వ్రాయటానికి మంచి సమాజసృష్టికి సిద్ధమైవున్నాం - హారతితో ఆహ్వానిస్తున్నా" అన్నారు శైలజా మిత్ర.

జి. శోభ 'ఒడుపుగా పట్టుకో' అని సహనంతో తెలంగాణను చేజిక్కించుకొమ్మన్నారు.

'కనిపించని గొడ్డలి - మాయమైన చెట్టు'లో గీతాంజలి సెజ్‌లకు వ్యతిరేకంగా జరిగిన ఒక సంఘటన చేత స్పందించి వ్రాసారు. ఐతే ఇక్కడ 'చెట్టు'ను తెలంగాణకు, 'గొడ్డలి'ని ఆధిపత్యవర్గానికి ప్రతీకలుగా తీసుకుంటే తెలంగాణ మీద జరిగే దోపిడీ అన్యాయాలు ధ్వనిస్తాయి. 'ఆఖరికి రాలిపోయిన పండుటాకు వికసించి వట్టి పోయిన పువ్వు -



కసిగాయ ఏదీ నాది కాదని కాలేదని తెలుసు... ఈ చెట్టంటె ఎందుకింత ప్రేమ నాకు!' అంటారు.

తన తెలంగాణ ప్రేమను, అభిమానాన్ని వ్యక్తం చేస్తూ... 'కలకాదు' కవితలో తెలంగాణ తరుణిని సంబోధిస్తూ -

మృదుమధుర మాతృత్వలాలనతో 'బిడ్డా! విముక్తి కలిగించు' - అంటారు కవయిత్రి దిరిసెన.

రజనీవుడ్ 'కలాలు - వారెవ్వా!' దీర్ఘమైన కవితలో 'రాణిరుద్రమ్మలై సమ్మకలు సారలమ్మలుగా పరాయి పీడన నుండి విముక్తి సాధించి విజయ పతాకం ఎగరేస్తాం' అని స్త్రీశక్తిని పురిగొల్పారు.

డా॥ కె. లావణ్య కాకతీయుల ప్రతాపాన్ని సారక్క - సమ్మక్కల శౌర్యాన్ని చారిత్రిక నేపథ్యంతో కీర్తించారు - 'కాకతీయుల ప్రతాపం - సారక్కల శౌర్యం' కవితలో.

కొండేపూడి నిర్మల ప్రసిద్ధ స్త్రీవాద కవయిత్రి. ఆ ప్రాంతంవారైనా ఈ ప్రాంతం మీది అభిమానంతో తెలంగాణను తమదిగా చేసుకున్నారు. 'కడుపుల సల్ల కదలనోడి కతలే యేరు మరి....' అంటూ 'కాటి సుంకం' కవితలో రైతన్నల కష్టాలను, వలసలను, కూలీల వెతలను వినిపించారు. సుదీర్ఘమైన కవితలో ఆమె చక్కని తెలంగాణ పదాలను నుడికారాలను ప్రయోగించారు.

ప్రసిద్ధ కథా రచయిత్రి గోగు శ్యామల 'కాలజ్ఞానం' కవితలో 'యాభైఏండ్ల సమైక్యపాలనల అందినకాడికి మింగింగ్రడు...' అంటూ శ్యామల తెలంగాణాభూమి దోపిడీకి గురయిన కథను వినిపించారు. తెలంగాణలోని చాకలి ఐలమ్మ! జంగం లక్ష్మీబాయి, సదాలక్ష్మి, ఈశ్వరబాయి వంటి దళిత బహుజన స్త్రీలను స్మరించి తెలంగాణ తరుణికి పౌరుషం, నీతి, నాయకత్వం మెండుగా వున్నాయి కాబట్టి పోరాడటంలో వాళ్ళేం వెనుకబడి వుండరన్న సత్యాన్ని ధ్వనింపజేసారు.

విజయ 'కీలెరిగి...' కవితలో 'నిజాలను అబద్ధాలుగా వక్రీకరించే ప్రింట్ మీడియా, ఎలక్ట్రానిక్ మీడియాలను రెండింటినీ పక్షపాతం లేకుండా వ్యవహరించమని" హెచ్చరించారు.

'గచ్చపొదల చిచ్చు'గా మారిన తెలంగాణ సాధన సమస్యను చక్కని

కవితలో వ్యక్తం చేస్తూ. 'తెలంగాణా వాదం! అందరికీ వరసైంది అమ్మతేల్చదు! ఢిల్లీ అత్త ఓర్చదు' అని చాలా వ్యంగ్యోక్తితో పలికారు ప్రసిద్ధ కవయిత్రి జ్వలిత.

ఎన్. అరుణ ఎన్నో కవితా సంపుటాలు ప్రచురించిన ప్రముఖ కవయిత్రి. మంచి అభివ్యక్తి చాతుర్యం గల కవయిత్రి. తెలంగాణ పోరాటం గొంతు ఈ నాటిది కాదు. 'ఇదొక సుదీర్ఘకాల / మానవ సంవేదన / ఇప్పుడీ గొంతులు / కొత్తగా మెత్తగా మోగుతున్నాయి / ఇప్పుడిక / తరాలనాటి / కపట నిశ్శబ్దం పగలిపోక తప్పదు!' అంటారు అరుణ 'గత్యంతరం లేదు' కవితలో.

వి. ప్రభాదేవి - 'గబ్బిలాలు' చక్కని అన్యోక్తులతో అల్లిన కవిత. 'ఈ ఇల్లు మాది అని మేమూ మనది అని వాళ్ళూ హే కృష్ణా! నీవైనా చెప్పు న్యాయం ఇప్పుడు నీ మీదే వుంది భారం' అనటం చమత్కారంగా వుంది. 'హే కృష్ణా!' అని శ్రీకృష్ణ కమిటీని స్ఫురింపజేసిన ఉక్తివైచిత్రిబాగుంది.

'ఇక్కడి చిగురైనా చేవకల్గే వుంటుంది

ఇక్కడి మట్టి ఎర్రదనంతో పోరాట స్ఫూర్తితో

వెన్నుతట్టి గోగుపూలైనా యాది చెప్తుతుంటుంది'

అంటారు కొలిపాక శోభారాణి 'గోగుపువ్వు'లో.

శిలాలోలిత మంచి కవయిత్రి 'జీవనతత్వం' కవితలో సమసమాజంలో స్త్రీపురుషుల సమాన స్థితికి పోరాడి గెలిచిన వీరవనితలను స్మరించారు.

'జోకొడ్తారు జాగ్రత్త' కవిత విజయలక్ష్మి 'ఖబర్దార్! మమ్మల్నింకా జోకొట్టాలని చూడొద్దు మీరు!' అని నిలదీసారు.

తిరునగరి దేవకీ దేవి 'తెగించి కొట్లాడుడే' కవితలో

అచ్చమాంబనై కలం ఆయుధం పట్టినదాన్ని

పాలకుర్తి అయిలమ్మనై నా పాలు గింజల్ని దక్కించుకున్నదాన్ని

అని తెలంగాణ స్త్రీల అసలుసిసలు పోరాట పటిమని కీర్తించారు.

'తెలంగాణ తల్లి ఎత' కవయిత్రి అడువాల సుజాత పరిశోధకురాలు. ఈ కవితలో తెలంగాణా వచ్చేదాక పోరాడుదామని, 'తెలంగాణ తల్లి ఎత'



తీరేదాకా పోరాడుతామని ప్రతిజ్ఞ చేసారు.

మారుబడి సుజాత 'తెలంగాణ... ఏ మెట్టిన గడ్డ' కవితలో ఒక తెలంగాణకు వలస వచ్చిన స్త్రీగా, తెలంగాణ కోడలుగా, తెలంగాణ గడ్డ మీది ఇంటికి మెట్టిన బిడ్డగా తన అనుభవాలను అనుభూతులను అభివర్ణించారు. తెలంగాణాకు తన మద్దతును ప్రకటించారు. తెలంగాణ స్త్రీల స్వరంతో తన స్వరాన్ని కలిపి ఈ కవితను వ్రాసారు.

డా॥ త్రివేణి తన 'తెలంగాణ పండుగొచ్చింది' సుదీర్ఘ కవితలో తెలంగాణ పండుగలను, స్త్రీల కష్ట సుఖాలను అభివ్యక్తీకరించారు.

ఆర్. సుజాత రచించిన 'తెలంగాణ పిలుస్తోంది!'లో తెలంగాణ అందని అంగూర పండ్ల గుత్తిగా మారింది. అందుకే ఆ కవయిత్రి అంటారు -

'కమ్మకత్తి చేతబట్టి కొమ్మవంచి

ద్రాక్షగుత్తి అందుకొందాం - రండి!'

'తెలంగాణ సోదరా' కవితలో టి.రాజేశ్వరి

'మసక చీకటిని చీల్చే వెలుగు దివ్వెగా

వెలగరా ఓరన్న! తెలంగాణ మనదంటూ

గళమెత్తి పాడరా...!' అంటూ తెలంగాణ సోదరులకు ప్రోత్సాహాన్నిచ్చారు.

జూపాక సుభద్ర భాష, యాసలు అందరికీ తెలిసినవే! కథ వ్రాసినా కవిత వ్రాసినా, తెలంగాణ జనసామాన్యపు భాషయాసలే! ఆవేదనలే!

'ఓ పెద్దమనిషిన్నట్లు

నేను కోటిరతనాల వీణనేమో గాని

కోటి గాయాల గడ్డను అనేది నిజం!' అంటారు సుభద్ర

ఆమె

'నా జాగ నాగ్గావాలంటె

ఛత్! నీయయ్య విడదీస్తున్నరు

సమైక్యరాగాలు రాజేస్తుండ్రు...' అని అసహనం, ఆక్రోషాలను వెళ్ళగక్కుతారు.

శిరీషారాణి 'నా ఇంతజారు' కవిత 'ఉయ్యాల' ఊతపదంతో బతుకమ్మలనాడు పాడే పాటలాగా రమ్యంగా సాగింది.

'నాక్కాత్త గిరే' కవితలో విజయలక్ష్మి మంచి ప్రాంతీయ భాష యాసలను ప్రయోగించారు.

డా॥ వి. శోభ 'నా తెలంగాణా' పాటలాగా సాగింది. తెలంగాణ జనుల్లో పాట ఇంకిపోయి వుందనటానికిదే నిదర్శనం. మగ అయినా ఆడ అయినా పాటలు కట్టటం తెలంగాణ జనుల రక్తంలోనేవుంది. వాళ్ళకిష్టమైన ప్రక్రియ ఇప్పటికీ జీవించివున్న ప్రక్రియ. ఈ పాటతోనే వాళ్ళు ఎన్నో ఉద్యమాలను నడిపి లక్ష్యాలను సాధించారు.

'నాపల్లె' కవితలో కురిమెండ్ల సృజన. ఇప్పుడు నాపల్లె -

'అందం సందం లేక పొక్కిలైనవాకిల్లు

మురిపెం ముచ్చట్లు లేక బీరిపోయిన ఇండ్లు

పల్లెంత పర్సుకున్న సర్కారు తుమ్మ ముండ్లు' అయింది. మునుపటి అందచందాలు సందడి సంబరాలు లేవు. దోపిడీకి గురయిన ప్రజల వెతల కతలే అంతటా వినిపిస్తున్నాయి. ఒక ప్రాంతం మరో ప్రాంతాన్ని దోపిడీకి వివక్షకు వెక్కిరింతకు గురిచేయుటం ఎక్కడా ఇంతగా జరుగలేదేమో. ఆ వెక్కిరింతలే తెలంగాణ జనుల మనసులను కలతపెట్టనయి. తిరుగుబాటు వేర్పాటు పదాలనూ పాటలనూ నేర్పాయి.

'నిన్ను నువ్వే మార్చుకో'లో టి.లీల తెలంగాణ మహిళను సంబోధిస్తూ నిను నువ్వు మార్చుకో అని ఉద్బోధించారు.

తుర్లపాటి లక్ష్మి అచ్చమైన తెలంగాణ భాషలో 'నేను నగేయాల్ల' కవితలో

'సిర్ఫ్ సదువులు, కొలువులేగాదు

మా భూములు మాయేనంటున్నారు...'

అన్న ఆవేదనను వ్యక్తం చేసారు.

సస్య 'నేను మనిషిని కానా?' కవితలో 'ఆడపిల్లనని తెలియగానే కడుపులోనే చిదిమేస్తరు' - అని 'భ్రూణహత్య' నాటి నుంచి పెండ్లి చావు వరకూ స్త్రీ అనుభవించే కష్టాలను ప్రశ్నిస్తూ -

'ఆడపిల్లగా పుట్టడమేనా నేరమా? నాకిది ఓ శాపమా?' అని తన



హృదయవేదనను వ్యక్తం చేసింది. ఎంత సామాజిక ఆర్థిక అభివృద్ధి జరిగినా స్త్రీ జీవితంలో ఏం మార్పులేదు. స్త్రీ చిన్ననాటి నుంచి పడే హింసలకు ఆది అంతం లేదు. ఒక అయ్య చేతిలో పెడ్తేనన్న కష్టాలు తీరుతాయేమో అంటె అప్పుడు కొత్త కష్టాలకు మొదలు. కట్నం కానుకలు మరింత తెమ్మని హింసలు హత్యలు! దీన్నంతా సస్య కవయిత్రి పాఠకుల హృదయాలను కదిలించేట్లుగా కవిత్వంలో చెప్పారు.

హిమజ ప్రసిద్ధ కవయిత్రి. 'పల్లె తల్లి గుండె సప్పుడు...' కవితను మంచి తెలంగాణ నుడికారంలో వ్రాసారు. విదేశాలకు తరలిపోయిన పిల్లలకు 'ఒక్కసారి మన దేశం రాండ్రిరా కొడుకా...' ఈడనే మన మూలాలున్నాయ్ అని పిలుపునిచ్చారు. పల్లెలు అభివృద్ధి చెందడం లేదన్న ఆవేదనను వ్యక్తం చేసారు.

'బతకమ్మ - బతకమ్మా కోల్!' రచించారు జి. శ్యామల. దేనిమీదనైన పాట కట్టటం తెలంగాణ స్త్రీలకు పుట్టుకతో వచ్చిన విద్య. ఏ విషయాన్నైనా తమకు నచ్చిన తమ హృదయాలను స్పందింపజేసిన పాట అల్లటం వాళ్ళ కవితాహృదయానికి నిదర్శనం. ఈ పాటలో శ్యామల

'తెలంగాణ రావాలంటూ

రాబోయె బతకమ్మనూ

పాటల్లో ఆటల్లో

కొలుచుకుందాం చెల్లెలారా!

కోరుకుందాం అక్కలారా!'

అని పిలుపునిచ్చారు. పాటలో బతకమ్మలను ఎట్లా తయారు చేరుస్తారు పేరుస్తారు బతకమ్మ ఆటలను ఎట్లా ఆడుతారు, వివరంగా చెప్పారు. బతకమ్మ పాటకు 'ఉయ్యాల', అనిగాని 'వలలో' అనిగాని 'కోల్' అనిగాని ఊతపదం ఉంటుంది. ఈ పాటలో 'కోల్' అన్నది ఊతపదం.

కరుణ 'తాయమ్మ' కథ వ్రాసి తాయమ్మ కరుణగా పేరుబోయింది. 'బుక్కెడు బువ్వ - గుక్కెడు నీళ్ళ కోసం' కవితలో

'నాకూ నాబిడ్డలకు

బుక్కెడు బువ్వ దొరకాలె!' - అదే తెలంగాణ ఆకాంక్ష అన్నారు.

నెల్లుట్ల రమాదేవి కూడా ప్రసిద్ధ కవయిత్రి 'మన తెలంగాణ' సుదీర్ఘ

కవితలో తెలంగాణ చారిత్రక సాంస్కృతిక వైభవాన్ని స్మరించింది. యువత మళ్ళీ తెలంగాణ వైభావాన్ని ఉద్ధరించాలి. ఎగరేయాలి మళ్ళ కీర్తిపతాక' అంటారు.

అరుకొంతం ఇందిరాదేవి 'మాకు తెలుసు...' కవితలో 'మా గమ్యమేమిటో మాకు తెలుసు' అంటూ తెలంగాణా సాధనే తమ గమ్యమనీ - దానికి దారి మీరు చూపించేదేంటని వ్యంగ్యంగా పలికారు.

మేరీ కుమారి మాదిగ 'మా జోలికొస్తే...' కవితలో దళిత వేదన వుంది. ఒక్కగానొక్క కొడుకు ప్రత్యేక రాష్ట్రం ఉద్యమంలోకి వెళ్ళిపోయాడు. ఆ కొడుకు కోసం వెతుక్కుంటూ తల్లి బయలుదేరుతుంది.

'ఆత్మాహుతులు జేసుకొని అమరులైంర్రట

గండ్ల మావాడుగిన... ఏడన్న కన్పించిండా!' అని ఈ తల్లి భయపడుతుంది.

'తెలంగాణ ప్రత్యేక రాజ్యంలో

కొత్త ఎలుగును విరజిమ్ముతడేమో?' అని కండ్లార చూడడానికి 'నేను బతికే వుంటా!' అంటుంది తల్లి.

ఉద్యమంలో రేపటి బంగారు భవిష్యత్తువుంది ఆత్మహత్యలు చేసుకోవద్దు' - అనే ధ్వని ఈ కవితలో వుంది. తెలంగాణ నుడికారం సొంపుతో కవిత చక్కగా సాగింది.

విజయ దామోదర స్వామి 'మాతృమూర్తికి నివాళి' కవితలో కవయిత్రి తల్లి కీ.శే. జగ్గమ్మ ధీశాలి. పిల్లల్ని కనటం కాదు వాళ్ళను మంచి మార్గంలో నడిపించాలన్న ఆదర్శం గల మాతృమూర్తి. కవయిత్రి పాట రూపంలో ఎనభైయేండ్లు నిండుజీవితాన్ని గడిపి అందరికీ ప్రేమపంచిన అమ్మను స్మరించారు. ఆ అమ్మలో మాతృమూర్తులందరూ మూర్తీభవించారు. చక్కని కథనంతో పాట సాగింది.

'రెండు గుర్రాల స్వారీ' కవితలో - తెలంగాణా ప్రాంతంలో అభివృద్ధి జరుగలేదు 'యాడ వేసిన గొంగళి ఆడనే ఉన్నాం' అని ప్రాంతీయ వివక్షను, తెలంగాణ ప్రాంతీయాభిమానాన్ని ప్రశ్నించారు జ్యోత్స్న.

నాంపల్లి సుజాత 'లెంకపీట' కవితలో 'మాగడ్డపై మేమే అస్తిత్వాన్ని పోగొట్టుకున్నామ'ని వేదనను, మా ఇంట్లో మేమే పరాయివాళ్ళ



మయ్యామన్న బాధను వ్యక్తం చేసారు.

కందాల శోభారాణి 'శల్య రాజకీయాల్ని నమ్మే ఎర్రి బాగులోల్లం కాదు' కవితలో

'కోట్ల కత్తుల్ని పదును పెట్టే నెత్తుటి సాన

కోటి రత్నాల వీణ, మా తెలంగాణ...' అని అంటారు.

'శోకించకు' కవితలో అరుణశ్రీ ప్రతిభను, మానవహక్కులను నిర్వీర్యం చేసే రిజర్వేషన్లను నిలదీసారు.

చాడా లలితాదేవి 'సమరాంగన' కవితలో స్త్రీలుపోరాటాల్లో భాగస్వాములుగా ముందుంటామన్నారు. తెలంగాణ స్త్రీలు ఏ పోరాటంలోనైనా పురుషులతో సమానంగా నిలబడ్డారన్నది చారిత్రక సత్యం!

శారద హన్మాండ్లు 'సావకు బిడ్డా...' కవితలో

"సావకు బిడ్డా! మన జాగ మనదె

మన రాష్ట్రం మనదే..."

అని యువకులు ఆత్మహత్యలు చేనుకోవద్దనే సందేశాన్ని ధ్వనింపజేసారు.

సంగీత రాణి 'హిమ్మతితోని' కవితలో-

'పోరగాడికెల్లి ముసలవ్వదన్క-

తెలంగానంటె తెలిసి పోయినంక

తెలంగాన రాకుంటే యాడికిపోతది.." అని హిమ్మతితో అన్నారు.

చల్లపల్లి స్వరూపరాణి ప్రసిద్ధ కవయిత్రి. అక్కడిదయినా ఇక్కడి నేల అంటె అభిమానం! 'తెలంగాణ జీవగడ్డ, పోరు పతాకలు ఎగిరే భూమి'- అంటారు ఆమె 'క్షుద్రదేవత' కవితలో

ఆమె 'ఈనాటి అరుంధతి / సరికొత్త చిల్లంగి నూరుతుంది' అని దళిత వేదనతో పలికారు.

కె. విమల ప్రసిద్ధి స్త్రీ వాద కవయిత్రి "144 సెక్షన్" కవితలో ఆమె

"పచ్చికలోని గరిక పువ్వులు

ఖాకీల బూట్లకు నలుగుతున్నై!" అని పోలీసుల జులుంను

అభివర్ణించారు.

'గాయలే గేయాలై' తెలంగాణ గరిమను తెలంగాణ సంస్కృతిని, తెలంగాణ సంపదలు మావి మాకు కావాలనే భావనను వ్యక్తం చేసే కవితల సమాహారం.

ఈ సంకలనంలోని కవితలన్నీ 'పొక్కిలి'లోని తిరుగుబాటు కవితలను తలపిస్తున్నాయి. తెలంగాణపై ప్రేమాభిమానాలు కన్పిస్తున్నాయి. ఈ కవయిత్రుల కవితాసంకలనం తెలంగాణ అస్తిత్వవేదనా వాదం సాహిత్యంలో ఒక మైలురాయి వంటిది. అన్ని కవితలకు కవితలోని భావాన్ని వ్యక్తం చేస్తూ స్కెచ్‌లు వేయడం బాగుంది.

కవయిత్రులలో చాలా మంది తెలంగాణ వాళ్ళు. కొందరు అందమైన తెలంగాణ భాషను, యాసలను ప్రయోగించారు. కొందరు ప్రామాణిక భాషలో వ్రాసారు. ప్రకటనలలో కవితలు తెలంగాణ భాషయాసల్లో వుండాలని నొక్కి చెప్తే బాగుండేదేమో. సరే! అయినా కవితల్లో ఏమి లోటు రాలేదు.

సంపాదకులు ఎంతో కృషిచేసి కవయిత్రుల నుంచి కవితలను సంపాదించి ఈ పుస్తకాన్ని ముద్రించారు. కేవలం స్త్రీల కవితలను ఒక సంకలనంగా వేయాలని, స్త్రీ శక్తిని నిరూపించాలని వాళ్ళ ఆశయం... వాళ్ళ గురి నెరవేరిందని, చాల అరుదైన కవితల సంకలనాన్ని తెచ్చారని చెప్పాలి. ఈ అరుదైన, విశిష్టమైన సంకలనాన్ని వెలువరించిన సంపాదకులు 'రాజీవ, జ్వలిత, అమృతలత'ల కృషిని అభినందిస్తున్నాను.

ముదిగంటి సుజాతారెడ్డి,
2-2-1105/21, రోహిణం, తిలక్‌నగర్, హైదరాబాదు - 44



# ప్రక్షాళనం

- రాజీవ
సెల్: 98497 93914



కుట్రలూ, కుతంత్రాల ద్వారా - గద్దల్లా గద్దెలెక్కి - తెలంగాణా బడుగు జీవుల్ని దోపిడీ చేస్తున్న రాజకీయవేత్తలకు,

పల్లెజనుల ప్రతిభని నిర్వీర్యం చేస్తూ - పట్నాల్లో తమ సామ్రాజ్యాలు విస్తరించుకుంటోన్న వలసపారిశ్రామికవేత్తలకు,

శ్రామికులను వెట్టికీ, మత్తుకీ బానిసల్ని చేస్తూ - వారి జీవితాలను అంధకారంలోకి నెట్టిన దొరబాబులకూ, వారి దొరతనాలకూ,

ఆతిథ్యమిచ్చిన వారినే అడుక్కునే వాళ్ళుగా మార్చి, అంచెలంచెలుగా అందలమెక్కిన జిత్తులమారి దగాకోరులకు - పైరవీ దళారులకూ -

సహనం కోల్పోయిన తెలంగాణా కవయిత్రులు తమ పదునైన కలాలతో, సిరా బుల్లెట్లతో గురి చూసి చేస్తున్నారు... ప్రక్షాళనం!

★★★

తెలంగాణా తరుణులు ప్రేమ, అనురాగం, ఆప్యాయతలకు ప్రతీకలు! అణకువ, ఆదరణ అమాయకత్వం వారి ఆభరణాలు. ఆత్మాభిమానం, ఆత్మ విశ్వాసం వారి సహజత్వాలు! వీరి ప్రతిభా పాటవాలకు, శక్తి సామర్థ్యాలకు మా ఈ సంకలనం ప్రత్యక్ష సాక్షి.

ఇందులో రగులుతున్న అగ్ని కణికల్లాంటి చేయి తిరిగిన కవయిత్రులతో పాటూ, నివురు కప్పిన నిప్పుకణాల్లా ప్రప్రథమంగా

కలం పట్టి తమ ఆవేదన వ్యక్తం చేస్తోన్న మహిళలూ ఉన్నారు.

ఈ సంకలనంలో కవితలు స్త్రీల భావ స్వాతంత్ర్యానికి సంకేతాలు. కవయిత్రుల గుండె చీల్చుకు వచ్చిన ప్రభాత కిరణాలు - తొలి మేలుకొలుపులు! తమ ఆవేదన, ఆక్రందన, ఆశలు, ఆశయాలు, నిస్పృహలు, నిరాశలు, పోరాటాలు, మోసాలను... స్వేచ్ఛగా, నిర్భయంగా వ్యక్తం చేసారు!

వికసించినవైనా, మొగ్గలైనా - కవయిత్రులు యదాతథంగా వారి వ్యక్తిత్వాలను, భావాలను ప్రస్ఫుటం చేయడం జరిగింది.

కవయిత్రులలో చాలామంది తమ కలాలు కేవలం కాగితం, సెల్యులాయిడ్‌లకి పరిమితం కాకూడదని, అవి ప్రజల కోసం, సామాజిక శ్రేయస్సుకోసం అని త్రికరణ శుద్ధిగా నమ్మి, గ్రామీణ మహిళలతో సేవా కార్యక్రమాలలో మమేకమైన వారూ ఉన్నారు.

కొత్తవారు కూడా ఏకమై... దాదాపు ఈ యాభై ఏళ్ల తెలంగాణా పోరాటానికి అరవై మంది కలిసి 'బెటాలియన్'గా చరిత్ర సృష్టించారు.

★★★

డిసెంబర్ 9వ తేదీన తలపెట్టిన నా సంకల్పానికి... ఏ చలనం లేకుండా మార్చి 8కి నిండా నూరేళ్లు నిండాయని నీరసపడిన క్షణాల్లో "గో ఎహెడ్ - వి ఆర్ విత్ యూ" అంటూ అమృతలత, జ్వలిత కొండంత అండగా నిలిచారు. కవితలన్నింటినీ తుర్లపాటి లక్ష్మి, కిరణ్‌బాలలు అకారాది క్రమంలో అమర్చారు.

ఈ మహాయజ్ఞంలో ఎంతో మంది విసుగూ, విరామం లేకుండా- ముఖ్యంగా తిరునగరి దేవకీదేవి, అనిశెట్టి రజిత, నెల్లుట్ల రమాదేవి, జూపాక సుభద్ర, శిలాలోలిత, కిరణ్‌బాల



యింకా - ఎందరో - శ్రమించారు.

ఇలాంటి సంకలనం ఒకటి రావాలన్న తపనతో - తెలంగాణా కవయిత్రుల అడ్రస్‌లు మాకు అందజేసిన సోదర రచయితలు సిహెచ్. మధు, డాక్టర్ లచ్చయ్య, ఎనిశెట్టి శంకర్‌లకు మా కృతజ్ఞతలు!

ఈ నేలతల్లికి సేవ చేస్తూ ఈ మట్టిలో తుది శ్వాస తీసుకోవాలనుకుంటున్న ఈ కవయిత్రులు తెలంగాణ మాండలికాన్ని సందర్భాన్ని బట్టి ఉపయోగించారు. తెలుగు పాఠకులు విశ్వవ్యాప్తంగా ఉన్నారు కదా. నూరేళ్లు నిండిన అంతర్జాతీయ మహిళా దినోత్సవ సందర్భాన మా తెలంగాణ తరుణులు మహిళాజాతికి ఎప్పటికీ వాడిపోని కవితా సుమ మాలలు అలంకరించి, చరితార్థులయ్యారు.

మా తెలంగాణా తరుణుల 'గాయాలే... గేయాలై...' మహిళాలోకాన్ని ఉత్తేజ పరిచి, దశదిశలా శంఖారావం పూరిస్తుంది!

ఈ సంకలనం ఆంగ్లంలో అనువదించి అంతర్జాతీయం చేయాలని మా ఆకాంక్ష!

రాజీవ, 4-39/A, ఎల్లమ్మతోట, Adj: Government Junior College, Medchal - 501 401

# ఆత్మగౌరవం కోసం ఎక్కుపెట్టిన తెలంగాణ స్త్రీల కలాలు



- జ్వలిత
సెల్: 99891 98943

'ఆత్మగౌరవాన్ని వదులుకొని జీవించడం, మరణించడం కంటే హేయమైనది' అన్న భర్తృహరి సుభాషితాన్ని నెమరువేసుకొని తమ వంతు గొంతులు వినిపించడానికి కొందరు తెలంగాణ మహిళలు చేసిన ప్రయత్నమే ఈ 'గాయాలే... గేయాలై!' కవితా సంకలనం.

తెలంగాణ ఉద్యమం అస్తిత్వం కోసం చేసేది కాదు. ఇది హక్కుల కోసం చేసే పోరాటం. పసిపిల్లల నుండి పండుముసలి వరకు తెలంగాణ కోసం చేస్తున్న లడాయి.

బండారు అచ్చమాంబ సాహిత్య స్ఫూర్తినీ, చాకిలి అయిలమ్మ ఉద్యమ తెగువనీ అందిపుచ్చుకొని - గత అంతర్జాతీయ మహిళా దినోత్సవంనాడు తెలంగాణ మహిళల గొంతులు వినిపించడానికి ముగ్గురు తెలంగాణ స్త్రీలు సమిష్టిగా చేసిన ఒక చిరు ప్రయత్నమే ఈ అరవై కవితల సమాహారం.

ఆర్థిక దోపిడీ కంటే సాంస్కృతిక దోపిడీ నీచమైనది. దశాబ్దాలుగా ఆర్థిక, సాంస్కృతిక వనరుల దోపిడీకి గురవుతున్న తెలంగాణ ప్రజలు తమ మిధ్యాత్మక దాస్యంనుండి, బంధనాలనుండి విముక్తి పొందడానికి కవులు, కళాకారులు చేస్తున్న కృషి ఎంతో ముఖ్యమైంది.

ఎట్టకేలకు దశాబ్దాల అనంతరం మహిళా బిల్లు చట్టసభలో ప్రవేశ పెట్టబడిన సమయంలో తెలంగాణ కవయిత్రులు ఈ కవితా సంకలనం కోసం ప్రయత్నించడం హర్షించదగిన విషయం.

ఈ సందర్భంగా ఇక చిన్న కథ చెప్తాను.

ఒక ఊరిలో రద్దీగా ఉండే రోడ్డు మీద ఒక పెద్దరాయి పడి ఉంది. అందరూ దాన్ని చూస్తూ పక్కకు తప్పుకొని గొణుక్కుంటూ వెళ్తున్నారు. ఒకరిద్దరు 'దీన్ని ఎవ్వరూ తియ్యి లేకపోయారా' అని సణుక్కుంటూ



ముందుకు నడిచారు. మరికొందరు రాయి పెట్టిన వాళ్ళను వాళ్ళ వాళ్ళ స్థాయిల్లో తిట్టుకుంటూ వెళ్లారు. రోజంతా దాన్ని పాలమ్మేవాళ్ళు, పూలమ్మేవాళ్ళు, కూరలమ్మేవాళ్ళు, మాటలమ్మేవాళ్ళు, దేశాన్ని అమ్మేవాళ్ళు అందరూ చూస్తూ వెళ్ళిపోయారు.

సాయంత్రం వేళ ముగ్గురు పిల్లలు అటుగా వెళ్తూ ఆ రాయిని చూసారు. అంతకుముందు వాళ్ళు ఒకరికొకరు తెలియదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని, రాయివైపు చూశారు. ఒక్క మాట మాట్లాడకుండా ముగ్గురూ కలిసి ఆ రాయిని రోడ్డు పక్కకు దొర్లించారు.

ఆ రాయి కింద ఒక కాయితం మడతపెట్టి ఉంది. దాని మీద 'మీ అవసరం ఈ సమాజానికి ఉంది' అని రాసి ఉంది. ఈ 'గాయాలే... గేయాలై!' కవితా సంపుటి కోసం ప్రయత్నించిన రాజీవ, జ్వలిత, అమృతలత లతో పాటు ఈ కవితా సంకలనానికి తమ రచనలు పంపిన కవయిత్రులందరికీ పై చీటీలోని వాక్యం వర్తిస్తుంది! తెలంగాణ ప్రాంతపు ఈ సాహితీ సంపదని - రేపటి తరానికి ఒక 'అపురూపమైన కానుక'గా అందించాలనుకున్న అతి సాధారణ నారీమణులు వీరు!

క్షణం తీరికలేని పనివొత్తిడిలో కూడా... కవితల సేకరణనుండి - పుస్తకరూపంలో ఓ అందమైన ఆకృతిని అందించేంతవరకూ... ఈ కార్యభారాన్ని తలకెత్తుకుని, చివరంటా దించకుండా మోయటమే కాదు, ఆర్థికభారాన్ని సైతం తానే భరించిన అమృతలతగారి ఔదార్యానికీ... తెలంగాణాతల్లి పట్ల వారికున్న అవ్యాజానురాగానికీ... కృతజ్ఞతలు!

ఈ పుస్తకంలోని కవితల గురించి చెప్పవలిసి వస్తే ఇందులో ఉద్యమకారులు, సాహిత్యంలో లబ్ధప్రతిష్టులు, మరుగున దాగిన మణిపూసలు, తొలిసారి కలం పట్టిన వారూ ఉన్నారు.

పత్రికా ప్రకటన లేవీ లేకుండానే కేవలం ఫోన్‌కాల్స్, ఈమెయిల్స్‌కు స్పందించి తమ కవితలందించిన ఈ కవయిత్రులందరికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు!

జ్వలిత (ఎల్‌లెన్. విజయ కుమారి దెంచనాల) ఎం.ఏ., ఎ.ఎడ్., ఎ.ఎస్సీ., ఎల్.ఎల్.బి.
H.No. 7-3-386/1, విజయనగర్ కాలనీ - 2, ఖమ్మం - 507 002

# చేతులు సాచి... మనకై...



- అమృతలత
సెల్: 98488 68068

ఎవరన్నారు... తెలంగాణా మహిళలు రాయలేరని? ఒక్క పిలుపుతో- కేవలం ఇరవై రోజుల వ్యవధిలో దాదాపు అరవైమంది కవయిత్రులు స్పందించి... కలం పట్టి, గళమెత్తి తమవంతు కర్తవ్యంగా తెలంగాణా కవిత్వాన్ని వినిపించారు!

చేయి తిరిగిన తెలంగాణా కవయిత్రుల్నీ- సరియైన ఆదరణ, అవకాశాల్లేక మరుగున పడివున్న మాణిక్యాల్నీ - ఏకతాటిపైకి తెచ్చి... వారి మనోభావాలను ఆవిష్కరింపజేయాలనే రాజీవగారి సంకల్పానికి, జ్వలితగారి ఆలోచనకూ... క్రియా రూపమిస్తే... ఇదిగో... ఈ పుస్తకం... ఇలా మీ ముందుకొచ్చింది!

కవితా వస్తువు 'తెలంగాణే' అయినా... వివిధ కోణాల్లోంచి వస్తువును వీక్షించే నేర్పును ప్రదర్శిస్తూ... తమ ఆలోచనలను వ్యక్తీకరించిన వారిలో లబ్ధప్రతిష్టులు కొందరైతే... ఇప్పుడిప్పుడే కలం పట్టిన కవయిత్రులు మరి కొందరు!

మొత్తమ్మీద - దాదాపు అన్ని కవితల్లో సామాజిక, రాజకీయ, సాంస్కృతిక స్థితిగతులను ప్రతిబింబిస్తున్న 'తెలంగాణా' కన్పిస్తుంది! అందునా - తెలంగాణా జిల్లాల్లోని వివిధ మాండలికాలూ, యాసలూ... కొన్ని కవితల్లో చోటు చేసుకోవడం విశేషం!

అరాచకాలూ... అన్యాయాలు... అమెరికాలో జరిగినా, అండమాన్‌లో జరిగినా - ఇండియాలో జరిగినా... ఇరాక్‌లో జరిగినా - వాటిని ఖండించే విషయంలో కవులకి దేశ, భాష, మత, ప్రాంతీయ భేదాలుండవు!

సరిగ్గా ఈ దృక్కోణంతోనే... తెలంగాణా ప్రజల కష్టాలకు చలించి, జ్వలించి, ఆర్తితో స్పందించి - తమ సంఘీభావం తెలిపిన



తెలంగాణేతర కవయిత్రుల రచనలకు సైతం ఈ పుస్తకంలో సమున్నత స్థానమిచ్చాం!

ఈ పార్టీ ఆ పార్టీ అనే తేడా లేకుండా - అన్ని రాజకీయ పార్టీలకూ ఓ 'యూజ్ అండ్ త్రో' మన తెలంగాణ! ఈ పార్టీ తంతే ఆ పార్టీ కోర్టులో, ఆ పార్టీ తంతే ఈ పార్టీ కోర్టులో పడ్తూ... ఎడా పెడా దెబ్బలు తింటోన్న 'ఫుట్‌బాల్'... మన తెలంగాణ!!

తెలంగాణ ప్రజలనూ, విద్యార్థులను 'బకరా'లను చేస్తూ - సీమాంధ్ర నాయకులు ఆడిన కపట నాటకాలు, ఎత్తులూ జిత్తుల పట్ల - ఉదాసీనంగా వుండలేక... కేవలం వాటిని ఖండించడానికొరకే 'మొదటిసారి'గా కలం పట్టినవారి భావాలకూ ఈ పుస్తకంలో 'సముచిత' స్థానాన్నిచ్చాం!

తన 'ముందు మాట'తో - మాకు కొండంత ప్రోత్సాహాన్నిచ్చి, మాలో ఎనలేని ఆత్మవిశ్వాసాన్ని పెంచిన శ్రీమతి ముదిగంటి సుజాతారెడ్డి గారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

ఎక్కడెక్కడో వున్న అందమైన సాహితీ కుసుమాల్ని ఏరుకొచ్చి - ఓ మాలగా కూర్చి 'తెలంగాణాతల్లి' మెడలో వేద్దామనుకున్న మా ఆరాటానికి... అడుగడుగునా తన తోడ్పాటునందించారు అనిశెట్టి రజితగారు. వారికి మా కృతజ్ఞతలు!

ఇదంతా ఒకెత్తు - ఇక ఈ సంకలనానికి 'ఏం పేరు పెట్టాలా'? అని కొట్టుమిట్టాడుతోన్న సమయంలో చక్కని పేరు సూచించిన కిరణ్‌బాలకి మా అభినందనలు!

ప్రతి రోజూ రాత్రి ఒంటి గంటదాకా ఓపిగ్గా కూర్చుని అదో యజ్ఞంలా ఈ కవితలన్నింటినీ డీటీపీ చేసి పెట్టిన కల్యాణ్ బహదూర్‌నీ, అన్ని కవితలకీ ఎంతో అందంగా, భావయుక్తంగా- బొమ్మలేసిన 'బాబు' సహకారాన్నీ మరచిపోలేం!

ఈ పుస్తకం వెలువరించడంలో ఎన్నో పురిటి కష్టాలు!

రాజీవ గారు హైదరాబాదులో - జ్వలిత గారు ఖమ్మంలో - నేను

నిజామాబాదులో! ఇలా ముగ్గురం మూడు వేర్వేరు కార్నర్స్‌లో వున్నప్పటికినీ- ఎప్పటికప్పుడు మాకొచ్చిన కవితల్ని ఈ-మెయిల్స్ ద్వారా ఒకరికొకరం పంపించుకుంటూ - ఏమైతేనేం చివరకు... సకాలంలో అనుకున్నది పూర్తిచేసి - 'అమ్మయ్య! డెలివరీ అయిపోయింది' అనుకుని ఊపిరి పీల్చుకున్నాం!

ఇది మన తొలిప్రయత్నం! లోపాలు వుండటం సహజం! ముఖ్యంగా కమ్యూనికేషన్ గ్యాప్ వల్ల... కొంతమంది కవయిత్రులు తమ రచనలను పంపించలేకపోయారు! మరికొంత మందివి లేట్‌గా అందడం వల్ల ప్రచురణకి నోచుకోలేక పోయాయి! ఇవన్నీ సమీక్షించుకుని- మన మలిప్రయత్నంలో ఇలాంటివేవీ జరక్కుండా జాగ్రత్తపడదాం!

ఏదేమైనా - ఈ స్ఫూర్తితో మనం ఒకడుగు ముందుకేస్తే - 'తెలంగాణా రాష్ట్రం' చేతులు సాచి - నాలుగడుగులు మనకై నడిచొస్తుందని ఆశిద్దాం!

అమృతలత, ఎం.ఏ., ఎం.ఎడ్.,
'అహ్లాద', విజయ్ క్యాంపస్, మామిడిపల్లి, ఆర్మూర్, నిజామాబాద్ - 503 224



# అంత అది -

**- ఇంత ఇది!**



**- టి. వసంతా వివేక్**
సెల్: 98488 68064

ఇది నీది... అది నాది!
ఏది అది?

నీకు ముందే తెలుసా -
అది నీదనీ...
ఇది నాదనీ!?

నీ తర్వాత నీకు తెలుసా -
అది ఎవరిదని?
ఎందుకు దానిమీద నీకు అంత అది?'

**- బొజ్జ నిండినవాడి తత్త్వబోధ!**

★★★

ఇది నాది!
అది నీది!
ఇది.. నాకు 'తెలంగాణా'!
అది... నీకు 'సీమాంధ్ర'!



నిజమే -
నాకు ముందే తెలుసు...
అవి రెండూ వేర్వేరనీ!
ఆ రెండూ ఎప్పుడూ 'ఒకటి' కావని!

నా తర్వాత కూడా నాకు తెలుసు...
నాది.. 'గొంతెండి పోతోన్న' నా పిల్లలదని,
నీది... 'కడుపులోని చల్ల కదలని' నీ పిల్లలదని!
నా పిల్లలకీ - నీ పిల్లలకీ పొసగదని - పోలికే లేదని,
నా పిల్లల్నీ, నా తెలంగాణానీ పదిలంగా కాపాడుకోవాలని!
అందుకే...
కేవలం అందుకే... దీని మీద నాకు 'ఇంత ఇది'!

**- డొక్కలెండినవాడి ఆత్మఘోష!**

టి. వసంతా వివేక్, ఎం.ఏ., ఎం.ఎడ్., ఎం.ఫిల్.
ప్రిన్సిపాల్, విజయ్ హైస్కూల్, నిజామాబాద్.

# అణకువగల అమ్మాయి

- సుజని

సెల్ : 94907 05130



అణకువ గల అమ్మాయి
అని అనేవారందరూ నన్ను!
ఆగ్రహం చూడాలని
ఆరాట పడేవారు ఆప్తులు!
ఆగ్రహావేశాలు
ఆమడ దూరంలో ఉండేవి నాకు!
ఆగ్రహంగల అతను
అణకువగల నన్ను వివాహమాడాడు!
ఆగ్రహం గల అత్తగారి దగ్గర
అణిగిమణిగి మెదిలాను!
ఆగ్రహమూర్తులందరినీ
హాసంతో ఎదుర్కున్నాను!
అందరి ఆగ్రహాన్ని
ఆనందంగా స్వీకరించాను!
కోడళ్లు వచ్చారు కోపిష్టివాళ్లు -
కొడుకులు కూడా క్రోధమూర్తులే -
అన్నీ సమకూర్చే నాకు లేని ఆగ్రహం -
అణా సంపాదించని వాళ్లకెందుకో?

ఆనాటి నుండి ఈనాటి వరకు ఆలోచిస్తే -
అనిపించిందిప్పుడు అణకువ అనవసరమని!
అందరినీ ఆనందింపజేసినా -
ఆశించిందేదీ దోసిలికి చిక్కలేదు!
ఆవిరై పోయిన ఆశయం,
అంతమైపోతున్న ఆయుష్షు,
శల్యమై పోతున్న శరీరం,
అంతా ఐపోయిందనే ఆవేదన!





అంతరంగాన్ని శోధిస్తే అంతుచిక్కింది...
అణకువ వలన ఆవేదనే తప్ప -
ఆశయం, ఆకాంక్ష నెరవేరదని!
అదే అందిస్తున్నాను అక్షర మాలగా
అణకువ గల వాళ్లను మేల్కొల్పాలని!
అందరితో అణకువగా ఉన్నావంటే,
నీకు మిగిలేది ఆవేదనేనని!
అణకువకు అర్థం తెలియని అహంకారులు,
అడుగడుగునా నీకెదురవుతారని!
అనువుగాని చోట అణకువ చూపిస్తే -
అందరికీ చులకనవుతావని!
అందుకే...
ఆత్మాభిమానంతో,
ఆత్మస్థైర్యంతో అడుగువేయి -
ఆకాశంలో ధృవతారగా మిగిలిపో!

సుజని, ఇంటి నెం॥ 3-7-447/1, శ్రీరాం నగర్ కాలనీ, మన్సూరాబాద్,
opp: చైతన్య భారతి హైస్కూల్, ఎల్.బి. నగర్, హైదరాబాద్ - 500 068



# అభివృద్ధి మయసభలో తెలంగాణ

- రేపల్లె అల
సెల్ : 99496 36515

అమ్మ కడుపు చల్లగా కేదార రతనాలు పండాల్సిన చోట
సెజ్జుల వేషధారణలో రియలెస్టేట్ వ్యాపారాల విషప్పడిగలు
కళారాధన ముసుగులో భూ కబ్జా మతలబులు
కరి మింగిన వెలగపండు సాఫ్ట్‌వేర్ బూమ్‌ల పద్మవ్యూహంలో
దిక్కు తోచని యువత
షోడష కళల మహిళా బిల్లు మహర్దశకు చంద్రగ్రహణ ప్రాప్తే
కంఠస్థమే కంఠశోషగా వెలసిన కార్పోరేట్ విద్యాలయాలు
ఆపరేషన్ల ఆర్భాటాలతో సామాన్య జనం నడ్డి విరుస్తున్న
కార్పొరేట్ ఆసుపత్రులు
కుడికాలు చెప్పుకొంటే ఎడంకాలు చెప్పు ఫ్రీగా సప్లై
చేస్తున్న బడామాల్ బాగోతాలు
పై బాగోతాల మిగులు ఆదాయాలే పునాదిగా
వలసవాదుల బడా పరిశ్రమల్లో
జలవాయు ఉద్యోగాల కాలుష్యాలు
మార్కెట్ యాడ్స్ మహేంద్ర జాలంలో
మహిళల పూజనీయ స్థానం పూజ్యం
ప్రేమదాడులు వరకట్నాలు వేధింపులు
మూడు పువ్వులూ ఆరుకాయలు
ఇదే ఇదే భాషాపర రాష్ట్రాల అభివృద్ధి మయసభ!
ఈ మయసభలో వేర్పాటువాదం సంకుచితతత్వం కాగా
సమైక్యవాదం విశాలతత్వంగానే వికటాట్టహాసం చేస్తోంది
కేంద్ర ప్రభుత్వానిదెప్పుడూ దుర్యోధన పాత్రే
ఏ కమిటీ ఒప్పందాలు, జీవోలు, సూత్రాలు, వాటి ఉల్లంఘణ
యధాతథంగా కన్పించవు.
కన్పించేదెప్పుడూ ఉన్నది లేనట్లుగా లేంది ఉన్నట్లుగానే



ముఖ్యమంత్రులదెప్పుడూ ద్విపాత్రాభినయనమే
శకుని పాత్ర ధరిస్తూనే
కళ్ళకు గంతలు కట్టుకున్న గాంధారి నటన
ప్రాంతీయ నాయకుల ఊకదంపుడు
ఉపన్యాసాల సారమంతా ధృత రాష్ట్ర కౌగిలింతలే
అరవై సంవత్సరాలుగా కొనసాగుతున్న
అణచివేత అసహనం కాగా
ఏడ్వలేక నవ్వినందుకు
తెలంగాణ ప్రజలది సైరంధ్రి అవమానమే
ఇక రక్షించడానికి వచ్చిన కృష్ణుడెవరంటారా?
కేంద్రం సూత్రధారి చేతిలో ఏ హక్కులూ లేని తోలుబొమ్మ
అతడిస్తే గిస్తే నిర్ణయాల వలువల్ని
లగడపాటులు ఆయన అబ్బలూ
లాగేసుకోరనే గ్యారెంటీ ఉందా?
కరెంటుపోల్‌ను ఎక్కిన లెక్కలో
గమ్యం దిశగా కోతిది రెట్టింపు శ్రమ



కానీ ఈ పోరాటానిదెప్పుడూ ఎడతెగని ప్రయాణమే
శ్రమ ఆకాశం దిశగా
గమ్యం పాతాళ దిశగా
ప్రభుత్వ వంచితులై అభద్రతా ఊబిలో విద్యార్థులు
ఆయోమయపు ఆందోళనతో ఆత్మాహుతులు
క్యాంపస్‌లో అసాంఘిక శక్తుల ప్రమేయమంతా
పచ్చకామెర్ల సామెతని ప్రపంచానికి తెలిసిన సత్యమే
కన్నతల్లుల కడుపుకోత నిన్ను శాపమై కడతేర్చకముందే
విభజించక తప్పని రాష్ట్రాన్ని మనసారా అంగీకరించు
ప్రజల దీవెనార్థితో సల్లంగా సాగిద్దువు నీపాలనను.

రేపల్లె అల, M.I.G - 2, APHB colony, ఆలంపల్లి రోడ్, వికారాబాద్ - 501 101

# అవసరం

- షహనాజ్ ఫాతిమా
సెల్ : 94403 70137



ఆకలి కేకల ప్రతిధ్వని తెలంగాణ
కాలే కడుపులకు పరిష్కారం తెలంగాణ
ఆర్థిక పురోగతికి ఏకైక మార్గం తెలంగాణ
చేతి నిండా పని కోసం కావాలి తెలంగాణ
కనీసావసరాలు తీరడానికి కావాలి తెలంగాణ
బుద్ధి వికాస విద్యకోసం అవసరం తెలంగాణ
ఇహపర జ్ఞానాభివృద్ధికై సాధించాలి తెలంగాణ
సామాజిక చలనానికై పొందాలి తెలంగాణ
ప్రాణుల దప్పిక తీరడానికి తప్పని సరి తెలంగాణ
సమ్మిళిత సంస్కృతి పునరుజ్జీవనం తెలంగాణ
మరుగున పెట్టిన చరిత్ర జ్ఞాపకానికి తెలంగాణ
తరతమ భేదాలు పోయే ఏకత్వానికి తెలంగాణ
రాజకీయం కోసం కాక సామాన్యుని స్వాతంత్ర్యానికై తెలంగాణ
మనల్ని మనం స్వేచ్ఛగా పరిపాలించుకొనుటకు తెలంగాణ
మనింట్లో మనమున్నామనే నిశ్చింతకై తెలంగాణ
తెలంగాణ మన ఊపిరి.
హైద్రాబాద్ మన ప్రాణం
మన రాష్ట్రం తెలంగాణ.
మనమే తెచ్చుకుందాం తెలంగాణ...





షహనాజ్ ఫాతిమా, Q.No. A98, LMB colony, తిమ్మాపూర్ మండల్, కరీంనగర్ - 505 527 .



# ఆత్మగల్ల తల్లి....

- అనిశెట్టి రజిత
సెల్ : 98494 82462



తియ్యని జాన పలుకల అవ్వ
బుక్క బుక్క నోటికి అందిన కమ్మని బువ్వ
నా ఎడ్డి తల్లి బొండుమల్లె ఎచ్చమ్మా
ఎడతెగని ముచ్చట్ల పందిరి కింద
పలుకుబడుల బడిజెప్పిన పంతులమ్మా...

కథా చరిత్రను రాస్తివి
ధర్మశాలను కట్టి కథలు కూరిస్తివి
'మా ఊరిముచ్చట్లు' రాశి పోసి
మన పల్లె బతుకుల బొమ్మలు కడ్తివి.

ఆత్మగౌరవం జాతిపౌరుషం
పాండిత్యం పరిశోధకనైజం
నిత్యసాహిత్య సేద్యం మన
తెలంగాణా భాషా సాంస్కృతిక
పతాకం నీవు...

జీవభాష తెలంగాణాకు
సృజనశీలివై పట్టంగడ్తివి
విలక్షణమైన కవితాసృష్టితో
స్త్రీల లోకజ్ఞతను ప్రకటిస్తివి.

'ఎచ్చమ్మ కథల' తల్లి యశోదమ్మా
కళలకు పట్టు గొమ్మ పుట్టినిల్లు
నీ "సుధర్మ" గృహసౌధం
పాలమూరు కన్న ముద్దుబిడ్డా
కన్నాగురం మెచ్చిన కోడలమ్మా...

తెలంగాణ పాటలకు జలపాతమై
ఎగిసివడి పులకిస్తివి



'తెలంగాణ' అంటే చాలు విని
నిలువెల్లా విద్యుత్ కాంతివై ప్రవహిస్తివి..

తెలంగాణ ఎప్పుడొస్తదని
ఉద్యమాల వాకిట ఎదురు చూపులైతివి
తెలంగాణ రాష్ట్రం కోసం నా యశ్శమ్మా
అల్లాడి అల్లాడి తన్లాటైన యశోదమ్మా
ఆత్మగల్ల మా తెలంగాణ తల్లివమ్మా...

నీ ఆరాటం అంటుకున్నది
నీ ఆకాంక్ష జ్వలించి నిజమైతది
నీ భాషా ప్రాంతప్రేమ పండుతది
ఇంగ మన సంస్కృతి పునర్జీవిస్తది
నాలుగు కోట్లమంది తెలంగాణా జనులు
తెలంగాణ తల్లికి పట్టే నీరాజనాలు
పూలవానలై కురిసి పుల్కరిస్తయి
బతుకమ్మ తల్లి చల్లగుండాలె
అమ్మా గట్టి గింజల చేనమ్మా
నీకు దండాలె యశ్శమ్మా...


పాకాల యశోదారెడ్డి

(ఆచార్య పాకాల యశోదారెడ్డి రచయిత్రి, పండితురాలు, పరిశోధకులు, విమర్శకులు, కవయిత్రి, తెలంగాణా ప్రేమికురాలు! - ఆమె స్వప్నం ప్రత్యేక తెలంగాణా. యశోదమ్మ స్మృతిలో ఈ కవిత- **అనిశెట్టి రజిత**)

అనిశెట్టి రజిత, H.No. 3-12-60, కుమార్‌పల్లి, హన్మకొండ - 506 001



# 'ఆత్మ'క్షోభ

- ఎన్. విజయా కిషన్‌రెడ్డి,
సెల్: 98488 68085



సొంత గూటికోసం మేము రాజేసిన నిప్పుని...
మీరు డబ్బు సంచులందగానే ఆర్పేసారు నిస్సిగ్గుగా!

బలిచేశారు మమ్మల్ని సజీవంగా మంటల్లో-
బతికున్నారు మీరు హాయిగా ఏసీ గదుల్లో!

చూస్తున్నాం.... చూస్తున్నాం!
పదవుల ఆశకు...
తోకలు ముడిచిన మీ తీరుని-
ప్రగల్భాలు పలికి...
చేతులు దులిపేసుకున్న మీ నైజాన్నీ!

గత యాభై ఆరేళ్ళుగా....
పది జిల్లాల రాజకీయనాయకుల
ఇళ్ళు వాకిళ్లు పట్టుకుని
ఇంకా వేళ్ళాడుతూనే ఉన్నాం...
అసహనంగా... అశాంతిగా!



'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు' ఒక్కటే -
మాకు విముక్తినిచ్చేదీ - మా ఆత్మలకు శాంతినిచ్చేది!

ఎన్. విజయా కిషన్‌రెడ్డి, Plot No. 494/A, Road No. 22, Jubliee Hills, Hyderabad.

# ఆనాటి అందాలు

- వసంత సుబ్రమణ్యం
సెల్ : 99637 12792



హస్త కళలకు కాణాచి మన దేశం
ముడి పదార్థాల ఖజానా భారతదేశం
తెలంగాణ మహిళల విశిష్టతకు సాటిలేదే ప్రాంతం!
చేతి పనులకు మన మహిళలకే ప్రథమ కిరీటం
లంబాడ మహిళల లంగా రవికె చూడు!
రంగు దారాల అద్దాలలో ప్రతిబింబించే నిపుణత చూడు!
నెత్తి నుండి పాదాల వరకు జీరాడే చున్నీ
మిల మిల మెరిసె హొయలు చూడు!
ఇలలో కలలో చూడని
మా 'సుగాలి' చేతి కౌశల్యం చూడు!
ఏమాయె ఆ సొగసు సృష్టి అందాల జాలు,
అద్దాల చుట్టూ ప్రకృతి ప్రసాదించిన
పూసలు, గవ్వలు,
పర్యావరణ పరిరక్షణ అలంకారాలు
వికృత రూపంలో మిషన్ల మీద, ప్లాస్టిక్,
అద్దాలు, పాలితిన్ పూసలు
కృత్రిమంగా సహజత్వం కోల్పోయి
పేదల జీవన సరళి మీద
ఎంత దెబ్బ తీసాయో చూడు!
మా తెలంగాణ మహిళల మరో సృష్టి సవాల్
కొబ్బరి, యీతాకులతో
చకచకా చేతి వేళ్ల నృత్యంతో
చిందులు వేయించిన బుట్టలు, చాపలు,
రెమ్మలతో, కొమ్మలతో
కండ్ల నిండుగా, కనులు విందులు చేసిన కళని
మాయదారి ప్లాస్టిక్ బుట్టలు, చాపలు కొల్ల కొట్టాయి!
తాటి చెట్టు తాటాకు ఎనలేని పవిత్రత



అనాది కాలం నుండి కొలవ బడింది.
ధాన్యం ఆర బెట్టడం
నిద్రించేందుకు చాపలు అల్లడం
ఆడపిల్ల తొలిసారి పెద్దదైనప్పుడు
నాలుగు రోజులు తాటాకుల పై ఉంచడం,
పసివారికి గిలకలు, చిలకలు,
చిన్నారులకు కుక్క, కోతి బొమ్మలు
తాటాకులకు రంగులద్ది రకరకాలుగా చేసారు.
కాటేసిన ప్లాస్టిక్, పాలిథిన్
సహజ వృత్తి కళలను
కళాకారుల్ని భగ్గున మండించి
భస్మీపటలం చేసాయి.
చిరిగి పోయిన పాత బట్టలతో
రకరకాల ముక్కలు కత్తిరించి
సైను బట్ట మీద కుట్టి
రజాయిలు, బొంతలు కుట్టారు -
ఇంటి అలంకరణతో మురిసారు.



అది పూరి గుడిసె అయినా - ఓ పూల మొక్కతో,
తులసి మొక్కతో ఉండేది
బియ్యం పిండితో వాకిలి ముంగిట
ముగ్గులు, రంగవల్లులు కంటి నిండా
గుండె నిండా ఆహ్లాదం కలిగించేవి.
ప్రతీ పని భూమాతనూ, ఆ మట్టిని తినే
ప్రాణులనూ పరిరక్షించేవిగా ఉండేది
తెలంగాణ మహిళల
జీవనోపాధి దెబ్బ తీసినా -
ప్లాస్టిక్ పాలిథిన్ యిలాగే కొనసాగిన -
దునియా వికృత రూపంతో
కాళరాత్రిగా మారి మరు జన్మ ఎత్తుతుంది!

వసంత సుబ్రమణ్యం, Plot No. 09, Saket, VIA RADHIKA THEATRE, Hyderabad.

# ఆ రోజుల కోసం...!

- కిరణ్‌బాల
సెల్: 98488 68067



'ప్రాణం' అంటే ఎవరికి తీపి వుండదు?!
మనకి తెలీకుండానే... మనల్ని మనం...
అప్రయత్నంగానే రక్షించుకోజూస్తాం!
కనుపాపల్ని రక్షించుకోవటానికే కదూ...
కనురెప్పలు కొట్టుకునేది!
కొనవూపిరి దాకా బ్రతుకు సాగించడానికే కదా
మనిషి చేసే పోరాటం!
మరి వాళ్ళకి -
'ప్రాణం' ఎందుకు చేదయ్యింది?
వాళ్ళకి 'బ్రతుకు' అగ్గిపుల్లెందుకయ్యింది?
వాళ్ళకి బ్రతుకు
నిలువెల్లా కాలి 'బూడిద' యెందుకయ్యింది?
..........................???????????????
భవిష్యత్తు చీకటిగా కనిపించిందేమో!
నిరాశానిస్పృహలు ముంచేశాయేమో!
రణానికైనా... మరణానికైనా...
తెలంగాణా వీరుడు భయపడడు!
మరణిస్తే - మన రాష్ట్రం సిద్ధిస్తుందనుకుంటే -
ఓ నా తమ్ముళ్ళారా!
మూకుమ్మడి మరణాలకి
మీ అక్కలంతా సిద్ధంగా వున్నారు!
కానీ... మరణం అవసరమా!
బ్రతికి మనం సాధించుకోలేనిది...
మన చావులు సాధించిపెడతాయా?
నెవర్! నాతమ్ముళ్ళారా!
భయపడకండి!
నిరాశపడకండి!
ఉద్వేగపడకండి!





ముందు - ఇక ముందెవ్వరూ
చావు పేరెత్తమని 'ప్రమాణం' చెయ్యండి!
చావు కోసం చేసే ఈ తెగింపు...
బ్రతుకు కోసం చేస్తామని ఒట్టేయండి!
ఇక... మన బ్రతుకులు మనల్ని ఎట్లా బ్రతక నివ్వరో...
బతికుండీ తేల్చుకుందాం, రండి!
మన రాష్ట్రం మనకిచ్చేస్తే... మన బ్రతుకులు
ఎంత బాగుంటాయో బ్రతికుండీ చూపిద్దాం, లేవండి!
అంత వరకూ నా తమ్ముళ్ళారా!
'ఓడ' మునిగిపోతుందని తెలిసీ
బ్రతకటానికై తహతహలాడిన మొన్నటి
'టైటానిక్' సినిమా కథ మనకి ఆదర్శం!

ఆకాశంలో చందమామని చూపిస్తూ...
గోరు ముద్దలు తినిపిస్తూ...
మనం సాధించుకున్న మన చరిత్ర కథల్ని
మన పిల్లలకి సందేశాలుగా వినిపించే...
ఆ రోజులకోసం - పోరాడుదాం!
పోరాడి సాధిద్దాం! రండి! రండి!!

కిరణ్ బాల
1-15/5, శ్రీరామా కాలనీ, పెర్కిట్, ఆర్మూర్, నిజామాబాద్. - 503 224

# ఉద్యమం ఉప్పెనగా లేస్తే

- డా॥ తెన్నేటి సుధ
సెల్: 99660 27761

పురాణాల్లో, పురాతన గ్రంథాల్లో
ఎన్ని సూక్తులో -
మరి ఎన్నెన్ని నీతులో
అన్నీ మహిళలకే పరిమితం
ఎన్నెన్ని కట్టుబాట్లో
అన్నీ వనితలకే సీమితం
ప్రపంచ జనాభాలో సగం
ఆకాశంలో సగం
భార్యకు పర్యాయపదాల్లో అర్ధాంగి
అంటే సగం శరీరం
ఓర్పుకు ప్రతీక
సహనానికి మారుపేరు
ఆదిశక్తి, అపరకాళిక
ఇలాంటి చాలా విశేషణాలు
ఎన్నెన్నో బిరుదులు
సముచిత స్థానం కోసం
ప్రతి నిమిషం పోరాటం
ఎంత ఉద్యమిస్తున్నా
పురుషాధిక్యం మర్రివృక్షమై
నీడనున్న మొక్కలా
వనిత వాడిపోతున్నది
కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ
శయనేతురంభా - అంటూ
ఉదాత్త గుణాలతో కీర్తిస్తూ
ఆకాశానికి ఎత్తేస్తూ
కానరాని కిరీటం





శిరసుపైన అదిమేస్తూ
గౌరవిస్తున్నట్లు కనిపిస్తూ
హింసించే పురుషులు
నేటికీ తమ బావుటా ఎగరేస్తున్నారు
మాకే కిరీటాలూ వద్దు
పొగడ్తలసలే వద్దు
వ్యత్యాసం రూపుమాసి
మనుషులమయ్యే వరకు
మేం ఉద్యమిస్తాం.
ఉద్యమం ఉప్పెనగాలేస్తే
అప్పుడు
ఏ ఆనకట్టా ఆగదు
ప్రపంచ పటంపై మహిళ
శక్తిస్వరూపిణియై నిలుస్తుంది
ఈ విశ్వాన్నే శాసిస్తుంది.

డా॥ తెన్నేటి సుధ,
2-1-527/5, నల్లకుంట, హైదరాబాద్ - 500 044

# ఇక తెగతెంపులే!

- పి. సుజాత

సెల్: 98488 68086



ఎక్కడ కెనాల్ పారితే -
అక్కడ సారవంతమైన భూములు!

అక్కడే వెలిసాయి మీ గుడిసెల 'వలసలు'!
వాటికి అందమైన పేర్లు 'క్యాంపులు'!

'పోన్లే మన తెలుగు వాళ్ళే -
బతుకుతెరువుకొచ్చార'ని సరిపెట్టుకున్నాం!

మా తెలంగాణా అమాయకత్వాన్ని
మరింత లూటీ చేస్తూ...
మా ఉద్యోగాలకే పెట్టారు ఎసరు!




అంతేనా?
విద్యాలయాలూ, కాలేజీలూ -
ఫ్యాక్టరీలూ - ఒక్కటేమిటీ -
అన్నింటా వేళ్ళూనుకొని పోయారు!

ఇంత దోపిడీ చేసీ -
ఇంకా చాలదన్నట్టు... 'సమైక్యాంధ్ర' వల్లెవేస్తారు!

మాది... ఎక్కాలు చదివే వయసుకాదు -
లెక్కలు వేస్తున్నాం -
ఈ లెక్కన... మీరే మాకు బాకీ పడ్డారు!
ఇంత కాలం పీల్చి పిప్పి చేసింది చాలు!

తెగేదాకా తెలంగాణాని లాగింది మీరే!
ఇక - తెగతెంపులు తప్పవు మరి!

పి. సుజాత, ఎం.ఏ., ఎం.ఇడి., ఎల్ఎల్.ఎమ్., ఎమ్.ఫిల్,
Joint Secretary, విజయ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్సెస్,
మర్కల్, కామారెడ్డి, నిజామాబాద్.



# ఎదురు చూస్తూ...

- స్వాతీ శ్రీపాద

సెల్: 98668 01496



ఎక్కడ అదృశ్యమైపోయింది?
ఈ శూన్య మహా ప్రపంచం
ఏ అడవి గుబురుల్లో తలదాచుకుందుకు
జనావాసాలను వదిలి
పరిత్యక్తలా పారిపోయింది?
దిగంతాలను ముక్కున కరచుకు
రెక్కలు విదిలించుకుంటూ సాగే
అలల సమూహాలు అంతలోనే ఏ స్వప్న సీమలకు
సకుటుంబంగా తరలి వెళ్ళిపోయాయి?
ఇప్పటిదాకా తీరం వెంబడి ఊసులాడుకుంటూ
తృళ్ళిపడిన సజల కాంతలు
ఏ మయసభలోకి కనుమరుగైనాయి?
గుండె నట్టనడి మధ్యన
ఏళ్ళకేళ్ళుగా తవ్వుకుంటున్న
ఈ దిగుడు బావి ఎన్ని జీవనదీ ప్రవాహాల్ని
తనలో ఒంపుకుంటుంది?
ఎన్ని కన్నీటి తటాకాల్ని
లోలోపల కుదించుకుంటుంది?
యుగాల విషాదాలు రగిల్చిన మహాగ్ని జ్వాలల్లో
కాలి బూడిదై మళ్ళీ మళ్ళీ పునర్జనించే
మహా పక్షిలా
కొత్తలోకం రూపుదిద్దుకుంటోందా?



అదేవాస్తవం అక్షరాల సాక్షిగా నిజమైతే
ఒక్క జీవితం కాదు
ఎన్ని వసంతాలు యుగాలై దొర్లిపోయినా
ఇలా ఓ చుక్క సిరాలా మారి
చరిత్ర సువర్ణాక్షరాలు చెక్కేందుకు
యుగశిల్పినై
ఎదురుచూస్తూనే వుంటాను.

స్వాతీ శ్రీపాద, 104, యమునా అపార్ట్‌మెంట్స్, రామంతాపూర్, హైదరాబాద్ - 13

# ఎవరమ్మా !?

- నిర్మల అంజనేయులు
సెల్ : 99635 30494



ఎవరమ్మా - నీవెవరమ్మా,
నుదుట పైన కాసంత బొట్టు
నెత్తి కొప్పునిండా ఎర్ర ముద్ద బంతులు
కొంగునెత్తినిండా కప్పుకున్న
ఎవరమ్మా - నీవెవరమ్మా!?

చెవులకు మకర కుందనాలు,
చెవి పైకెగబడిన మాటీలు,
మెరిసే నక్షత్రంలా ముక్కుపుల్లతో
పాపటపైన గొళ్ళెం గొలుసుతో
ఎవరమ్మా - నీవెవరమ్మా!?

గుండ్ల పేరు గుండెపై
ధగధగలతో గోచి కట్టు చీర
చుట్టూ వంకెలు తిరిగిన వడ్డాలంతో -
చెక్కుకున్న తాళం గుత్తి
వయ్యారాలు వొలకపోస్తు నడయాడే
ఎవరమ్మా - నీవెవరమ్మా!?

రెండు చేతుల నిండా చార్మినార్
రాళ్ళు, ముత్యాలు పొదిగిన గాజుల గల గల
మోచేతి పైన రవిక క్రింద చుట్ల కడియం
నడుం బిగించి సంస్కృతికే సవాలు చేసే
ఎవరమ్మా - నీవెవరమ్మా!?





పాదాలకు ఘల్లున నవ్వే పట్ట గొలుసులు
వేళ్ళకు సాదా సీదా ఒర్పును చూపే మట్టెలు
పసుపు లేపనం పై మైదాకు ఎర్రపూత
తాంబూలం ఎరుపు, ఉదయభానుని మెరుపు
ఎవరమ్మా - నీవెవరమ్మా!?

మేడారం సారలమ్మవా - సమ్మక్కవా,
కాకతీయ కిరణం రుద్రమ రౌద్రానివా
డిచ్చిపల్లి దారికాచే దేవీ దుర్గమ్మవా
మేడ్చల్ అర్ధనారీశ్వరుని ఆదిశక్తివా,
ఎవరమ్మా - నీవెవరమ్మా!?

తెలంగాణ వర్గల్ చదువులమ్మా
రక్తి, శక్తి, సూక్తి నీవేనమ్మా,
అమ్మలకన్న మాయమ్మ
విజయహో దిగ్విజయహో!

నిర్మల అంజనేయులు, D.No. 3-15-584, తిరుమలగిరి, సికింద్రాబాద్ - 15

# ఏకాభిప్రాయం

- సుజాత ముదిరాజ్
సెల్ : 96035 49096



తెలంగాణ రాష్ట్ర సాధనకై
తొలిసారి కలం పట్టాను

బండ్లు బోనాలతో
బయలు దేరింది మావూరి జనం

తెలుగు సంవత్సరానికి
ఆహ్వానం పలికింది పల్లె పిలుపు

తెలంగాణ నినాదాలతో కొత్తదనం
లేని వుషారు లేవనెత్తింది మా మహిళల్లో!

కేకలు, కేరింతల మధ్య
అందాయి అమ్మవార్లకు పూజలు.

పల్లెసీమ వాతావరణంలో
గడిపాను నాలుగు రోజులు నాగిరెడ్డి పేటలో

ఎప్పటిలాగే ఏటేటా
బండ్ల పై కుటుంబాలతో వచ్చి
చెట్ల క్రింద ఓరాత్రి నిద్రిస్తారు



నిద్రలో కూడ అందరి కలలు
నిజం చేయమని అమ్మను కోరారు

తెలంగాణ మాది - మాదేనని
ఏకాభిప్రాయంతో నినదించారు.

సుజాత ముదిరాజ్, H.No. 2-51/3, సిద్ధార్థ లైఫ్ ఇన్స్టిట్యూట్,
APHB colony, మేడ్చల్, రంగారెడ్డి - 501 401



# ఏది నా తెలంగాన?!

- తమ్మెర రాధిక
సెల్ : 94406 26702



న్యాల తల్లి చింపుల బోరాలను కప్పుకుంది,
చిన్న పోరగాల్ల కడుపులు నింపలేక.
సన్న మెతుకు బువ్వ
ఎన్నాల్లయిందో తిని మా అవ్వ!
ఒడ్ల గుమ్మిలు వలసలు బోతున్నయి,
కురాటి కుండలు చిట్లిపోయిన గతంతో మూలవడి.
అరిగిపోయిన యిసుర్రవుతులు,
కూలిపోయిన దొరల గడిలల్ల దిష్టి బొమ్మలైనయి.
ఎండిపోయిన శాదబాయిలల్ల
ఎన్కబడ్డ తనపు గుది బండలు దింపుతున్రు.
బాటెంబడి నడుస్తావుంటే
పెల్లలూడిన గోడలు
సెత్త మొల్సిన బాడ్వలు సుత
కర్వుకు కున్కబట్టినయి.
మా యింట్ల
దొడ్డి దర్వాజ తీసుడాలీసెం
తెల్ల కొండలు కూసున్నట్టు ఆవులెడ్లు!
గరిసర్ర సూస్తె చాలు
రాసులు పోసినోడ్లు!
ఎయ్యి ఇప్పుడయ్యి? ఒగప్పుడు
ములుగర్ర ముడ్డెంబడి పంజేసే జీతాళ్ళు...
సద్ది బువ్వకే సవుడేసి ఉతికిన సాకలి బానలు,
తల పాగలు సుట్టుకోని గల్వముందు సేకుసిందులు.



మా దొర గడీల....

రోసిపోయిన బానిసత్వం

తిర్గబడింది దొరతనమ్మీద!

చెట్లు సయి జుట్లు యిరబోసుకు

ఉరికినయి బురుజు గోడల మీదకి.

సవురు దీపం కొంపలు

రాదారి సెడిన డొంకలు

నోళ్ళిచ్చిన రేగళ్ళు

పాలి పగలకు బలయిన తెలంగాన చెల్కలు.

రంకెలేసి అరిసినా,

రంగులేసి బొంకినా,

ప్రవాహం మల్లిపోయిన నీల్లు

పాడి పంటల్ని పచ్చంగ చేయవు.

నచ్చని బత్కుల్ని నడిమింట్ల పీన్గెలెక్క బరించాలె!

లొల్లిలనే వుంచుతది.

తమ్మెర రాధిక, C/o. T.V.V. Rao, తొర్రూర్, వరంగల్ - 506 163





# ఒంటె - ఓనరు

- టి. కవితా దివాకర్

సెల్ : 98488 68078

నాడు... అనుభవించాం బానిసత్వాన్ని

విదేశీయుల పాలనలో!

నేడు... అనుభవిస్తున్నాం బానిసత్వాన్ని

సహచరుల సాంగత్యంలో!



మొన్న... మేం ఇల్లు అద్దెకిస్తే -

నిన్న... ఇల్లే మాదంటూ -

ఓనర్ని బయటికి పంపిన

'ఒంటె'లయ్యారు!

పైగా... ఇప్పుడు

'ఇద్దరం కలిసే వుందా'మంటున్నారు!

ఇరుకింట్లో... పాముల మధ్య సహజీవనమా?

బాబోయ్, ఎప్పుడు కాటేస్తాయో తెలీదు!

అందుకే...

నేడు...

అస్త్రశస్త్రాల్ని సిద్ధం చేసుకుంటున్నాం!

రేపో మాపో...

మా ఇంటిని మేం స్వాధీనం చేసుకుంటాం!

టి. కవిత, ఎం.ఎ., ఎం.ఎడ్.,

ప్రిన్సిపాల్, విజయ్ హై స్కూల్, ఆర్మూర్, జిల్లా : నిజామాబాద్, 503 224

# ఒక్క పోరాటం... వేలవేల గాయాలు.

- శైలజా మిత్ర
సెల్: 92909 00879, 9550367430



ఒక చోట నిజాన్ని చంపేస్తారు
మరొక చోట మనిషిని ఉరితీస్తారు..
జనం ముందు ఆశ్రువులు
తగలపెట్టేముందు అగ్గిపెట్టె రాజకీయాలు
మిగిలేది ఏమీలేదు కర్మకాండలు..
ఏమి చెబితే అర్థమవుతుంది మీకు
యాభై ఏళ్ళ తెలంగాణ పోరాటాలు

అస్తమిస్తున్నాడని
సూర్యుడు ఓడిపోతున్నాడంటే
ఎంత నిజం..
చీకటిని తరిమేస్తున్నాడని
చంద్రుడు గర్వపడితే
ఎంత అసహజం...
తరిమి తరిమి కొడుతూ
తెంగాణ బిడ్డ
ఓడిపోతున్నాడంటే
ఎంతటి దారుణం...?
నింగికీ నేలకూ సంబంధం లేదంటే ఎలా?
తల్లీ బిడ్డ వేర్వేరు అంటే ఎలా?
మీకేమి తెలుసురా
మా ఖజానాలో ఎన్ని మోసాలున్నాయో?
మీకెలా చెప్పనురా
మా గుండెల్లో ఎన్ని చురకత్తులు దిగబడ్డాయో?

మీరు ప్రళయాలు సృష్టిస్తే
మేము ఆహుతయ్యాము
మీరు చిమ్మచీకట్లో మమ్ముంచితే



దిక్కులేక చెట్టుకు చుట్టుకున్న
కొండచిలువలమయ్యాము
మీరు సుడిగాలి సృష్టిస్తే
కొట్టుకుపోయి ఊరవతల ఒంటరివాళ్ళమయ్యాము
ఆఖరికి మీరు మా శవాలను కోరుతుంటే
ఆశయ సిద్ధికై రక్తం ధారపోస్తున్నాము..
ఇక్కడ మా శరీరాలకు కొత్తగా శక్తులు లేవు
మా గుండెలో ఉన్న నమ్మకం తప్ప!
మా గొంతులో సరికొత్త రాగాల్లేవు,
ఒకటే మాటల వంతెనపై నిలబడటం తప్ప!



అయినా ఇన్నేళ్ళ చరిత్రలో
మాకేమి మిగిల్చారు?
మీరు నడుస్తున్నా -
అవి మా మైదానాలే!
మీరు తింటున్నా -
అవన్నీ మా భూమి సంపదలే!
మాది మాది అంటూ
నాలుగు దిక్కులు పిక్కటిల్లేలా
పరుగులు తీసినంత మాత్రానా -
అష్ట దిక్పాలురు మీవారు కారు కదా?
మాది కాలంతో పెంచుకున్న విశ్వాసం..
గుండెల్లో పాతుకుపోయిన ప్రేమ సామ్రాజ్యం.
ఎక్కడున్నా, ఎవ్వరైనా మాది ఒకటే పేగు బంధం
అయిదు పదులు దాటినా
ఏమాత్రం చూపును కోల్పోని
ఆత్మ నిగ్రహం మాచిహ్నం!

ఆధ్యాత్మికంలో
దేశమే కాదు దేహం కూడా ఒక భాషే...
నాలుగు చక్రాల వాహనమే కాదు

రెండు కాళ్ళ మనిషి కూడా ఒక వాహనమే..!
మీకు ధనముంటే దాచుకోండి,
విరుచుకుపడే రోగముంటే మార్చుకోండి!
ఇప్పుడు ఆలోచిస్తున్నాము -
ఇన్నాళ్ళూ చూసిందంతా నటనేనా?
మీ ప్రేమైక పిలుపులన్నీ కపటమేనా?
తప్పిదం ఎక్కడ జరిగింది?
యుద్ధ వ్యూహంలోనా?
తోడుగావస్తున్న వ్యక్తుల ఎంపికలోనా?
చివరిగా ఇపుడేమి మిగిలింది?
విషయ సేకరణలో విషమెంత దాగుంది?
ఎన్ని కడుపుకోతల్ని మిగిల్చింది?

తొందర పడకు!
ఇప్పుడు మా కుటుంబం కదిలింది!
మా గొంతులు ఫతంగులు కావనే
నిజం తెలిసింది...
మా ఆశయంలో కొత్త శక్తి ఉంది
మేము మందలం కాము
చైతన్య సమూహాలం!
సిద్ధంకండి
కొత్త చరిత్రగా
తెలంగాణా తిలకాన్ని
దిద్దుకోవడానికి...
మరో సమాజ సృష్టికి
హారతి పట్టడానికి...

శైలజా మిత్ర
98, సౌజన్యా ఎవెన్యూ, గాంధీనగర్, ఎస్.బి.ఐ. కాలనీ, హైదరాబాద్ - 80



# ఒడుపుగా పట్టుకో!

- జి. శోభ
సెల్: 98481 15176



**09.12.2009 అర్ధరాత్రి**

"హిపిప్ హుర్రే!"
"ఎందుకా ఆనందం?"
"వచ్చేసింది! వచ్చేసింది!"
"ఏదీ"
"మా తెలంగాణా"
"ఎప్పుడు?"
"ఇప్పుడే!"

**10.12.2009 ఉదయం**



"ప్చ్!"
"ఎందుకా నిస్పృహ?"
"పోయింది, పోయింది!"
"ఏమిటది?"
"మా తెలంగాణే!"
"ఏమైపోయింది?"
"ఛ! దొరికినట్టే దొరికి -
పాదరసంలా జారి
పోయింది!"
"దిగులు పడకు!
పట్టు వదలని విక్రమార్కుని కథ తలచుకో!
ఒడుపు తెలిసి పట్టుకుంటే చేజిక్కుతుంది!
తెలంగాణా నీదవుతుంది!
నిజం, నీదే అవుతుంది!"

జి. శోభ
26/A, ఓల్డ్ ఎమ్.ఎల్.ఏ క్వార్టర్స్, హైదరగూడ, హైదరాబాద్.

# కనిపించని గొడ్డలి - మాయమైన చెట్టు

**- గీతాంజలి**

సెల్ : 98497 70409

ఎన్నిసార్లు అనుకుంటానో కదా -
ఈ చెట్టు నీడ నాది కాదని...
కనీసం దీని కొమ్మ - గూడు - చివురు -
పూవు - వికసించని మొగ్గ -
ఆఖరికి రాలిపోయిన పండుటాకు
వికసించి వట్టి పోయిన పూవు -
కసిగాయ ఏదీ నాది కాదని
కాలేదని తెలుసు -
యీ చెట్టు మీద నుంచి సాగి
నన్ను తాకే పరిమళభరితమైన గాలి -
ఈ ఆకులపైన మెరిసే సూర్య బిందువు -
వేడి వెన్నెల
ఏదీ నాది కాదని తెలుసు!
చెట్టు పైన ఆకాశం,
చెట్టు కింది నేలా
నావి కాదని తెలుసు!
అయినా ఎందుకు ఈ చెట్టును
కావలించుకొని
ఉండాలనిపిస్తుంది!
తన కొమ్మలతో నన్ను
కౌగలించుకొమ్మని,
బతిమిలాడాలనిపిస్తుంది?!
కనిపించని గొడ్డలితో, ఈ చెట్టునెవరైనా
నానించి విడదీస్తారేమోనని,
చెట్టు గూటిలో రామచిలకనై -
ఇల్లు కట్టుకోవాలనిపిస్తోంది!
పోనీ - మరణం తర్వాతైనా



తన నీడన ఉన్న భూమి గుండెలో చోటిస్తే -
ఈ చెట్టుకి పూవునై పూయాలని అనిపిస్తుంది.
ఈ చెట్టంటే ఎందుకింత ప్రేమ నాకు!
ఈ చెట్టు ఎన్నెన్ని నినాదాలు ప్రతిధ్వనించిందనీ!
ఎన్నెన్ని కన్నీళ్ల సముద్రాలని -
తన వెల్లల్లోకి నిశ్శబ్దంగా యీడుస్తూ -
తనలోకి ఇంకించుకుందని!
తన నీడలో మూడు రాళ్ళ పొయ్యి మీద
ఉడుకుతున్న రైతు ఆఖరి వడ్లగింజల్ని చూస్తూ -
తనూ కుతకుత ఉడికి పోయిందని!
ఆకు ఆకులో అగ్నికణాలను మోస్తూ -
రైతులాగే తననూ కూకటి వేళ్ళతో
పెకిలిస్తారేమోనని, కొమ్మలతో, రెమ్మలతో
తలబాదుకుంటూ భోరు భోరున ఏడ్చిందనీ!
చెట్టు, రైతు, భూమి ఒక్కటన్న నినాదాన్ని
విప్లవించిదనీ! -
అందుకే ఈ చెట్టంటే 'చెట్టంత' ప్రేమ నాకు!

(పల్లెల్లో సెజ్‌లకు వ్యతిరేకంగా ధర్నాచేస్తున్న రైతులకు సంవత్సరాల అనుబంధమున్న చెట్టు నీడనిచ్చింది. దాని నీడలో రైతులు రోజుల తరబడి వండుకొని అక్కడే పండుకొని ముప్పై రోజులు నిరవధిక ధర్నా చేయడంతో - అక్కడ తమ భూముల్లో అక్రమంగా కట్టబడుతున్న "అరబిందో హిటరో ఫార్మా కంపెనీ"లకు సరఫరా అవుతున్న సిమెంటు, కంకర, ఇనుములను లోపలికి రానివ్వకపోవడం, వాటిని బయటకు తరలించడం చేసారు. ఈ చెట్టే లేకుండా చేస్తే రైతులిక ధర్నాచేయరని - కంపెనీ ఆ మహావృక్షాన్ని రాత్రికి రాత్రి కొట్టేసింది. అది చూడలేక వలవలా ఏడ్చిన జంగమ్మకూ, కన్నీళ్ళలో కదలిపోయిన మహబూబ్‌నగర్ పోలెపల్లి గ్రామవాసులకూ ఈ కవిత అంకితం.

**- గీతాంజలి, విరసం సిటీ కన్వీనర్ - హైదరాబాద్)**

గీతాంజలి,
అలకాపురి, రోడ్ నెం. 5, వరలక్ష్మి అపార్ట్‌మెంట్స్ జీ.1, సరూర్‌నగర్ మండల్, హైదరాబాద్ -35

# కల కాదు



- దిరిసెన

సెల్ : 94934 09839

నిజ జీవితం చేదు గుళికయినపుడు
ఊహలు హోమియో మాత్రలా మింగితే ఏం లాభం!
చేదు గుళిక రోజుల తరబడి నాలో లీనమైంది.
నెలలూ... ఏళ్లూ... ముదసలినైనా... వదలటం లేదు!
హోమియో మాత్ర ఒక్క క్షణంలో కరిగింది
మళ్ళీ మళ్ళీ మింగేందుకు పైసలు పుక్కానికి దొరకవుగా
శ్వాస బిగుసుకుంటోంది -
నాలోని ఓ చిత్రం దూరం నుండి కష్టంగానైనా
గుండె ఎగిసి ఎగిసి పడుతున్నా -
చూడాలనిపిస్తోంది!
భీకరంగా గర్జిస్తూ నా దరికి వస్తున్న మృత్యువును,
ఏ శక్తి తరిమి కొట్టగలదు!?
ఒక్క క్షణం - ఒకే ఒక్కక్షణం
ఆ చిత్రాన్ని తనివి తీరా చూసుకునే శక్తి
ఆ ఒక్క క్షణం బ్రతుకు బాటలో
ఎన్ని అవాంతరాలు - ఎన్ని అడ్డంకులు
అబ్బా - కాళ్ళూ చేతులు కొట్టుకుంటున్నాయి
వీళ్ళు డాక్టర్లా -
ఐక్యత పేరుతో చీల్చి తినే రాబందులా!
ఎమర్జన్సీ పేరుతో నా చేతులూ కాళ్ళూ కట్టేసి
వార్డులో ఒక్కరూ లేకుండా కుట్రలు చేస్తున్నారు.
ఈ భయంకర నరక యాతన
ఐ.సి.యు వంటరితనానికి
దిక్కులేక బిక్కచచ్చి, బిత్తర చూపులు చూస్తూ
ఆ - చిత్రం...
అదే నా కలల చిత్రం, నా గుండెలో దాగుంది!
అద్భుత అందాల అనురాగాల మహరాజ్ఞి





గాయాలతో నెత్తురోడుతో
నిప్పులు కురిసే కండ్లతో...
యింకా క్రాంతి కాంతులు తడి ఆరనీయక
మృదు మధుర మాతృత్వ లాలనతో -
'బిడ్డా విముక్తి కలిగించు' - అంటోంది.
ఒక్కసారి నా కండ్లకు అద్దుకొని
గుండెకు హత్తుకొని
ఊరి మట్టిపొట్లం
నా నుదుట దిద్దుకొని
మృత్యువుకి వెల్‌కమ్ అంటా -
నా కలల చిత్రం అదే,
ఆమె - తెలంగాణా తరుణి!

దిరిసెన, గవర్నమెంట్ జూనియర్ కాలేజ్, మేడ్చల్ - 501 401

# కలాలు - వారెవ్వా!

- రజినీ వుడ్
సెల్ : 0061433555131



దెబ్బ కొట్టిన వాడికి తెలియదు బాధ
తగిలిన గుండెనే కెలుకుతుంది వ్యధ
కడుపు తీపి గుండెలోతుల్లో సమాధి చేసి
పొత్తిళ్ళ పసిగుడ్డును పొదల్లో పండబెడితే
కసాయిది, కనికరం లేని రాక్షసి, పిశాచి అంటారే!
బలైన దుర్మార్గాన్ని బయటపెట్టి ఓదార్చాలంటే
భయంతో బిగుసుకుపోయి బింకంగా
"చూస్తాం, చేస్తాం, వస్తాం" అంటూ
తొంగి చూడక పోయినా
పాఠకుల హృదయాలను కన్నీళ్ళ వెక్కిళ్ళతో తడిపి
కలవరపరిచి కదిలించే ఓ కలాలు - వారెవ్వా!

సాటి మహిళల నీతి నిజాయితీపై విశ్వాసమున్నా
ఎక్స్‌ప్లాయిట్ చేసే దుండగుల అమానుష ఆధారాలతో
ఒంటరివారిని మరింత నిస్సహాయులను చేస్తూ
బహిష్కరించామనే ధైర్యంలేక
తప్పుకు తిరిగే పిరికి పైరవీకారుల్ని
సమర్థించి సపోర్టు చేసే కలాలు - వారెవ్వా!

ఊహల పల్లకిలో - మబ్బుకెరటాలలో
పండు వెన్నెల్లో చందమామతో
దోబూచులాడించని - వాస్తవ ప్రజా మహిళలను
భావుకత లేని విరాగినులుగా
ప్రేమ స్పందన లేని రాయీ రప్పలా
మానసిక హింసకు గురిచేసి,
వారి అవకాశాలను చేజిక్కించుకొని
పక్కింటి పుంటి కూరకు



లొట్టలు వేస్తున్న ఓ మా కలాలు - వారెవ్వా!

కోట్లు మింగిన నాయకులకు సలాం కొట్టి
మనుగడకు తెచ్చుకున్న ముష్టి - లంచమని
కఠినమైన చిత్రవధకు గురిచేస్తున్న
దొంగ దొరలను గద్దెపై బిఠాయించి
కనీసం కారణం తెలుసుకోలేని - కలాలూ
మీ సాహస సామర్థ్యాలూ - వారెవ్వా!



అర్బన్ మహిళల్లో కంటే తేవాల్సింది
చైతన్యం - గ్రామీణ వనితల్లో!
మా తాతతండ్రులు బానిసలైతే
ఆ బానిసలకు బానిసలు మా మహిళలు!
ప్రాంతీయ అసమానతలతో తెలంగాణ స్త్రీలు -
తమ హక్కులూ అవకాశాలపై -
కనీస అవగాహన లేక
చెలకల్లో ఊడిగం చేస్తుంటే -
స్త్రీలలో విద్య - ఆరోగ్యం - ఆర్థిక స్వాతంత్ర్యం
చైతన్య సోపానాలని
హెచ్చరించని మీ కలాలూ... వారెవ్వా!

సోమరితనం, మత్తు, దౌర్భాగ్య లక్షణాలనీ
శ్రమ, క్రమశిక్షణ,
ఆత్మవిశ్వాసం మహిళలకు గౌరవాలని తెలయచేయరు!
ఎత్తుకు ఎదిగిన వాళ్ళను మించి
ఎత్తు ఎదిగే శక్తి సత్తాలున్న
బడుగు మధ్య సంప్రదాయ మహిళల
శక్తి సామర్థ్యాలు... వండటం, పండడంతో
తుడిచి పెట్టుకు పోతున్నాయ్!
బాలికలైనా, యువతులైనా, వృద్ధులైనా
శక్తికి తగిన శ్రమ చేపట్టే చేయూత -

యిరుగు పొరుగు, సమాజం, మీడియా అందించాలి!
నేరాన్ని శిక్షించకుండా
నేరస్థులుగా బలిపీఠం మీదున్న
అభాగినులు మా మహిళలు!
బాధ్యతల బరువులో పాతాళంలోకి
క్రుంగిపోతున్న అవిద్యావంతులు
మా అమ్మలు, అమ్మమ్మలు!



ఫ్రీడమ్ ఆఫ్ స్పీచ్, ఫ్రీడమ్ ఆఫ్ ప్రెస్
రాజ్యాంగ చట్టాల్లో కాగితాలపై బరకడం కాదు -
మా ఊర్లలో - మా ప్రజల గుండెల పైన
చెక్కుచెదరని అక్షరాలతో నేర్పండి!
మీరు చేయరు - మేమే చేస్తాం...
రాణిరుద్రమ్మలై, సమ్మక్క సారలమ్మలుగా
పరాయి పీడన నుండి
విముక్తి సాధించి
విజయ పతాకం ఎగరేస్తాం -
ఆ రోజు... మీరూ, మీ కలాలూ - వారెవ్వా!

రజినీ వుడ్, 4-39/A, ఎల్లమ్మతోట, Adj: Government Juniot College, Medchal - 501 401



# కాకతీయుల ప్రతాపం - సమ్మక్క సారక్కల శౌర్యం

- డా॥ కె. లావణ్య
సెల్ : 98484 10244



కాకతీయ గుండె మీద
ఓరుగల్లు కోట ఉంది
దక్షిణ గంగాదరి మీద
చిలుకల గట్టుకొండ ఉంది
ఢాకారం, జాకారం
నర్సాపురం, గణపురం
శైవక్షేత్ర సంపన్నం
వీరశైవ మోక్ష పదం!
తాడ్వాయి మండల తపఃఫలం!!
ఏటి ఒడ్డున ఏటూరు నగరం
ఏడు తరాల శిల్పకళ సౌందర్యం
మేటిదైన మేడ రాజ్యం
వన చరుల సామ్రాజ్యం
ఉర్వీజ్ఞాన శీలురకు
ఉజ్జ్వల ఖ్యాతి ప్రకాశం
అవతరించింది
ఆది పరాశక్తి
ఎల్లేరు గడ్డమీద
శ్రీ మాలచ్చిమి
మాయమ్మ సమ్మక్క
దైవాంశ సంభూత
అల్లావుద్దీన్ ఖిల్జీని అడ్డుకొని
మేడరాజ్య రక్షణకు
పాటుపడియె పడిగిద్దరాజు
పరాక్రముడు! పరాశురుడు...

మేడ రాజ్య నాయకుడు!
ధర్మపత్ని సమ్మక్క
సద్గుణవతి సమ్మక్క
మూఢ నమ్మకాల నుంచి
మేడ రాజ్య గూడాన్ని
కాపాడిన శక్తి మాత!
సమ్మక్క పడిగిద్దరాజు
పుణ్య దంపతుల ముద్దుల పట్టి
సారలమ్మ రాజపుత్రి!!
సమ్మక్క యుక్తి
శక్తి యుక్తుల దైవత్వం!
మేడారం సౌభాగ్యం!



సమ్మక్క తల్లీ! సమ్మక్కతల్లీ!
భక్తులను కాపాడే ఓ కల్పవల్లీ!
మేడారం నందున కొలువైన అమ్మ!
మా సేవలందేటి బంగారుబొమ్మా!
పడిగిద్దరాజుకు వడ్డింపు దేవీ!
చిన్ని సారక్కకు జనయిత్రివమ్మా!
ఆడేము పాడేము నీ ఎదుట మేము!
వన దుర్గ నీవే నవ దుర్గ నీవే!
దంతీశ్వరీ నీవే జగదీశ్వరీ నీవే,
కాకతమ్మా నీవే ఏకవీరా నీవే,
వనదేవతా - నీకు వందనం తల్లీ!
సత్యదేవతా - నీకు సాగి మొక్కేంతల్లీ!
సమ్మక్క తల్లీ! సమ్మక్క తల్లీ!
భక్తులను కాపాడే ఓ కల్పవల్లీ!

సమ్మక్క గద్దెను కుంకుమతో చేస్తారు



బంగారుకమ్మతో బెల్లాన్ని తీస్తారు
బొమ్మయై అమ్మగా సమ్మక్క వస్తుంది
పండంటి బిడ్డల్ని భక్తులకు ఇస్తుంది
వినండి, వినండి - వింతైన ఈ కథలు!!
జరిగినా కథలూ - జరిగేటి కథలూ!!
గత వైభవ దేదీప్యం
ఏకశిలానగర పాలనం
అమీర్‌ఖుస్రూ కీర్తనం
ప్రపంచ ఖ్యాతి ప్రాభవం
నేటికీ ఓరుగల్లు - మేటిదై శోభిల్లు!!
ఏనాటికీ ఏకఛత్రాధి పత్యం
వర్ధిల్లు!! వర్ధిల్లు!!

శ్రీ గిరి మల్లమ్మవై
తిరుమల బాలమ్మవై
కంచి కామాక్షివై
మధుర మీనాక్షివై
బెజవాడ కనక దుర్గవై
ఓరుగల్లు భద్రకాళివై
కాకతమ్మవై, మాహూరమ్మవై
దంతీశ్వరివై, వింధ్యావాసినివై
సమ్మక్క వర్ధిల్లు!
సారలమ్మ శోభిల్లు!!



డా॥ కె. లావణ్య, అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ అఫ్ తెలుగు స్టడీస్,
తెలంగాణా యూనివర్సిటీ, డిచ్‌పల్లి, నిజామాబాద్ - 503 175

# కాటి సుంకం

- కొండెపూడి నిర్మల
సెల్ : 99493 03626



సంపేటోనికి సచ్చేటోడు లోకువ గద అన్నా...
వాడట్టనే గునుగుతడు
కాటిసుంకాల కోసం రైతు కరువు సెయ్యి సాపాడంట..
కొంపకూలిన బతుకు నస్టం
ఆళ్ళిచ్చే ముదనస్టంతో తీరుద్దా...?
కడుపుల సల్ల కదలనోడి కతలే యేరు మరి...
బూవి పుట్టకముందునుంచీ వున్న తిప్పలేనాయిరి
బండ పడిన బాయిల్లా బతికేదానికి కొత్తనా...?
పొదుగుమీది పోరగల్లని ఎట్టికి ఇడుసుడు కొత్తనా...?
ఒక్కపంట సేతికొచ్చినా సగంఅప్పు తిప్పి కొట్టేటోళ్ళం
పస్తులుండి దేవులాడినా కరెంటు బిల్లుకి శాతనైత లేదు
ప్రయివేటు ఫైనోన్సోళ్ళకి బుక్కినకొద్దీ దుడ్డు
మిత్తికి తెచ్చిన పైసలన్నీ మన్నుల పాతిపెట్టుడే అయితది
రెక్కలకాడి సెమటేడికి పోతదో... రగతమేడ నీరయితదో...?
ఇత్తు మొలిసినట్టే వుంటది,
కాయి గత్తరొచ్చిన బిడ్డలెక్క కన్నిడవకనే పంటది
పిడికిలంత పత్తికోసం కొమ్మలన్నీ కుప్పవోసుడే
మేమేమన్న గీ మన్నుల జపాను దేశాన్ని
దింపేదానికి అప్పుజేసినమా...?
సొంత ఇమానం దింపేదానికి అప్పుజేసినమా...?
దినానికి తట్టేడు గుడ్లు పొదిగే లబ్బరు పురుగుల్లెక్క
మీ నల్లకాతా, తెల్లకాతా సల్లగనే వుండాల
మా అసుంటోళ్లు కురిసే కొంప కప్పుకున్నా జూదమే
బిడ్డకు లగ్గంజేసినా జూదమే
గీలావు జూదం పన్ల కోసమేనయ్యా
మేం వున్న నేల అమ్ముకుంటం



అమ్మకుంటానికేం లేకనే మస్కట్టుల పారెల్తాం
తిండి గింజకు గిట్టుబాటులేకనే సిరిపంటకు దిగినం కద
మమ్ముల్నీ గోతుల ఇడిసిందెవరు..?
జొన్నలు ఇత్తినప్పుడైన గింతగోరమెన్నడూ లేదయ్యా
సంపేటోడు సావు లెక్క జెడితే సచ్చేటొడు సంతలోన జోగడా..?
సంతకోతలూ, సావుకారు లెక్కలూ కొంపమీనికొచ్చి
తట్టాబుట్టా ఇసిరిసిరి కొడుతుంటే
ఓటడిగినోడొచ్చిండా... వొరాలిచ్చినోడొచ్చిండా..?
గుడ్డ తొడిగిన గడ్డి బొమ్మలెక్క బతకాలనే అనుకున్నం
సీమల్లెక్క దోమల్లెక్క సావడానికి
గీ రైతు జల్మమే ఎత్తాల్నా బాబూ?
పీనిగల్ని బొంద పెట్టే కాటోడికి సుంకం ఇచ్చినట్టు
ఆళ్ల తప్పు మేం దాచేటందుకు, సర్కారోడు నష్టం ఇస్తాడంట
గీ పీనిగ నష్టాల లెక్క మా సేటపెయ్యికి సాలవు
మిత్తి బరువుకీ, మెతుకు బరువుకీ సిగ్గు సీతికిపోతంటే
మన్ను పిసికి బువ్వ తీసే గీ పిడికిలి సూపి అడిగేటందుకు
పల్లె నుంచి అసెంబ్లీ కాడికొచ్చినం
యవసాయం సేసేటోడ్ని కేడిగాడి లెక్క సూసి లాఠీలతో నూకిన్రు
గిదేమి రాజ్జెమో... గిదేమి నాశినమో...
నేతలంటె గోడలెనక, కుర్సీలెనక దాగేటోళ్ళని మాకానాడే తలవవట్టె
సత్తాలేని సర్కారోడికి మాలాంటి సన్నాసోడే లోకువ గద అన్నా
మా అడవులల్ల కట్టె మాది కాక పాయె
మా వాగులల్ల ఇసుక మాది కాక పాయె
రైతన్నలు కూల్నాకొడుకౌల కిందనన్న బతుకనివ్వకుండ
గదేందో గడ్డితొక్కే మిసన్లు తెవ్వాలని
దొరలంత పెద్ద సింత సేవట్టిన్రు
మడుసులకు మన్ను సాలని దిబ్బలో
రైతులేం జేసుడు, పసులేం జేసుడు
దున్నటానికి మోసే కాడితో సావుగుంట తవ్విండో
ఎలుగు కోసం ముట్టిన దీపం కొరివి మంట జేసిండో

ఎన్నొద్దుల మనసు రాయిజేసుకు నడిచిండో నా పెనిమిటి..?
ముందు మాట లేదు, సివరి మాటలేదు
అయ్యలేని గీ బిడ్డలమీదొట్టు
ఆగమాగమై వున్నోడికి దొడ్డసింత వచ్చుద్దా...?
సేనుల్ల పురుగు పాకి బతుకుల్ల పరుగు మందు పాకి
మడిసీ మడిసెక్కా ఒక్కతీరున సచ్చిపోతే
కన్నోల్లకీ, కట్టుకున్నదానికీ కడుపు సెరువైన గోస
గా దళారోడు ఎంగిలి జేసిన కాటిసుంకంతో తీరుద్దా..?
సంపేటోడికి సచ్చేటోడు లోకువ గద అన్నా వాడట్టనే గునుగుతడు
ఎన్ని మందులు సల్లినా, సేను కొరికే పురుగు బతుకుతాంది
ఎన్ని ఎలచ్చన్లు మారినా, దేశం కొరికే సర్కారు బతుకుతాంది
సచ్చిసెడి బతకాల్నో, బతికిసెడి సావాల్నో
గీ గొనుగుడు గొనిగే కతర్ నా కొడుకుల
ఇజ్జత్తు మీన దెబ్బ కొట్టి
అడగాల్సిందెవురు...?
బక్కరైతూ, బుగ్గిసేనూ...
సచ్చేడిదే నేరమైతే సంపేటోడికి సిచ్చేమిటి...?
బతికేడిదే బారమైతే బరువు మోసే బుజమేడిది...?



కొండెపూడి నిర్మల,
Flat No. 305., మహేశ్వరి కాంప్లెక్స్, మాసబ్ ట్యాంక్ క్రాస్ రోడ్స్, హైదరాబాదు - 28



# కాల జ్ఞానం

- గోగు శ్యామల
సెల్ : 98669 78450



వెలుపల ఆవుల గట్టి దాపున పోతును గట్టి
వాగుల దున్నవోతే త్రైదలే పండినట్లు
వింటవ తెలంగాణ డిల్లి తీరెట్లుందో
కంటవ బతుకమ్మో వలసాంధ్ర తీరును
మనుసువెట్టి వింటారా తెలంగాణ కథను
యాభై ఏండ్ల సమైక్య పాలనల అందిన కాడికి మింగింద్రు
భూములను మింగింద్రు.
భూ గర్భంలోని సంపదనూ మింగింద్రు.
సదువులను మింగింద్రు,
కొలువులను మింగింద్రు.
అడువులను ఆకులను పత్రహరితాన్ని మింగింద్రు.
మింగుడు యజ్ఞాలను ఆగకుండ చేస్తున్నరు.
నా సేనూ సెల్క వాగు తడారి ఎడారులైనవి
యజ్ఞసెగలకు తాలలేక కడుపు సేత వట్టుకొని
దేశ సరిహద్దులు దాటిన పేగుబందం
జై తెలంగాణా అని అలతేరుతున్నది
తెలంగాణ భౌవిశత్తు యువతరం
అగ్ని గోళాలైతున్నది.
పాతాలంలకు తోసిన జీవ జాడలను కాగడకెత్తుతున్నది.
హైటెక్ అభివృద్ధితో డ్రైనేజి గుంతల్ల ముంచిన
వైనాన్ని ఈసడించి కాకరించి ఊంచుతున్నరు.
వలస ఓయిన బిడ్డకోసం తల్లి గోసవడుతున్నది.
సంసారాన్ని యడవాపిన వలస పాలన మాకొద్దని
తెగేసి చెపుతున్నది తెలంగాణ కోడలిపిల్ల
కడుపు కాల్చిన సమైక్యాంధ్ర పాలనపై వడిశెలెత్తింది
తెలంగాణ ఆడబిడ్డ.

చాకలి ఐలమ్మ తెగింపు
యాదవ సంగం లక్ష్మీబాయి నీతి
మాదిగ సదాలక్ష్మీ నాయకత్వం
మాల ఈశ్వరీబాయి పౌరుషం
తెలంగాణ తరునికి మెండుగా ఉన్నయి.
పోరుతూనే ఉన్నమూ, సూస్తూనే ఉన్నము
ఓపిక వడుతూనే ఉన్నము. ఇంకా అక్కరలేదు
తెలంగాణా ప్రజలు క్షమించాలంటే
మరియాదగా నీ రాష్ట్రాన్ని నీవు చూసుకో
నీ రాజదానిని నీవ చేసుకో లేదా
నీ బొంద జాగను నీవు చూసుకో
లేదా చివరి సారి చెపుతున్నా నీ పాపాలను రాసిపెట్టిన భూతల్లి
బద్దలై నిను పాతిపెడ్తది.
ప్రళయమైన గంగ నిన్ను ముంచేస్తది.
కబడ్దార్ సమైక్య సంపన్న మనువులారా
జై తెలంగాణ! జై జై తెలంగాణ!!



గోగు శ్యామల,
H.No. 3-6-17, ఇందిరానగర్, రామంతపూర్, హైదరాబాదు - 13



# కీలెరిగి...

- విజయ
సెల్ : 98488 48866

అనారోగ్యమైతే ఆస్పత్రికి వెడ్తాం
అన్యాయం జరిగితే కోర్టుకి వెడ్తాం
ప్రభుత్వమే పక్షపాతం చూపితే -
ఉద్యమాలు చేస్తాం, ధర్నాలుచేస్తాం
బందులు పెడ్తాం, రాస్తారోకోలు చేస్తాం.
ఇంకా స్పందించకపోతే...
'ఓటు' వేటుతో - గద్దె దించుతాం!

తల్లిదండ్రులు పిల్లల్ని పోషిస్తారు
టీచర్లు విద్యా బుద్ధులు నేర్పిస్తారు
ప్రొఫెసర్ కోదండరాం విద్యార్థులని
ఉద్యమాలకి పిలుస్తున్నారంటే
విద్యార్థుల బంగారు భవిష్యత్తుకి
సోపానం వేయడానికే గానీ
తన కుర్చీ కోసం కాదు -
రాష్ట్రంలో అశాంతిని
రేకెత్తించటానికి అసలే కాదు!



ప్రింట్ మీడియా
ఎలక్ట్రానిక్ మీడియా
చేతిలో ఉన్నంత మాత్రాన
నిజాల్ని అబద్ధాలుగా
అబద్ధాల్ని నిజాలుగా
వక్రీకరిస్తే -
చైతన్యవంతులైన తెలంగాణా ప్రజలం
కీలెరిగి వాతపెడ్తాం!
పేపర్ కొనడం మాని సర్క్యులేషన్నీ,
టీవీలు చూడ్డం మాని రేటింగ్స్‌నీ -
పడగొడ్తాం జాగ్రత్త!

విజయ, మినార్‌పల్లి, బోధన్, నిజామాబాద్.

# గత్యంతరం లేదు

- ఎన్. అరుణ
సెల్ : 040 - 27037585



కన్నీళ్లు అంతటా ఉంటాయి గాని
ఇవి
ఎండిన పొలం బీటల్లోంచి ఉబికే ఆవిరి భాష్పాలు

చిరునవ్వులు అంతటా ఉంటాయిగాని
ఇవి
నవ్వలేక ఏడ్చే దు:ఖంలోంచి రాలిపడే
నిస్తేజ చంద్రవంకలు.

స్త్రీలు అంతటా ఉంటారు గాని
తరతరాల మానవ యాతనను ఖాళీకుండల్లా మోసే
అతి దీన హీన మానవ కళేబరాలు.

నీళ్లు అంతటా ఉంటాయి గాని
విషం కలిసిన ఫ్లోరోసిస్ జలధారలు
ఇక్కడ ప్రాణాలు తీస్తాయి.

గోదావరి అంతటా ఉంటుంది గాని
ఇక్కడ కిందికి దూకి చనిపోవడానికే పనికొస్తుంది.

దక్కను పీఠభూమిపై కురిసే వర్షంతో
కృష్ణమ్మకూడా దాహం తీర్చుకుంటుంది గానీ
వెనక్కి రావటానికి తటపటాయింపెందుకో?



రాజకీయాలు అంతటా ఉంటాయి గానీ
ప్యూడలిజంతో తడిసిన రెక్కలు
ఎగరటానికి తపతపలాడుతున్నాయి.

అవును
ఇదొక సుదీర్ఘకాల
మానవ సంవేదన

ఇప్పుడీ గొంతులు
కొత్తగా, మెత్తగా మోగుతున్నాయి

ఇప్పుడిక
తరాలనాటి
కపట నిశ్శబ్దం పగిలిపోక తప్పదు.



ఎన్. అరుణ,
H.No. 3-31-1-5B, శ్రీనివాసపురం, రామంతాపూర్, హైదరాబాదు - 13

# గచ్చ పొదల చిచ్చు

**- జ్వలిత**

సెల్ : 99891 98943



తెలంగాణ తెగని సమస్యల పుట్ట
పాంచాలిని ఫణంగా పెట్టిన
కురుక్షేత్ర కుట్ర
అందరూ సమ్మతులే
కనపడని అసమ్మతి సవతులే

రోడ్డెక్కిన ఆడపిల్లోలె
తెలంగాణా వాదం
అందరికీ వరసైంది
అమ్మ తేల్చదు
ఢిల్లీ అత్త ఓర్చదు
క్షణం క్షణం శీల పరీక్షల తెలంగాణ
దొంగ చొరబడితే ఒకనాటి గోస
దొరలసుంటి దేశముదుర్లు
దేశాన్ని దేశ చరిత్రను మింగుతున్రు
నీటిని నేల ఊటను
మాన్యాలను గనులను
ఉద్యోగాలను పదవులను
చుట్టుకున్న గచ్చపొదలు
పచ్చటి బతుకులను
బీటలుపడ్డ బీళ్ళు చేసి
కడుపుల పిండాన్ని - కాజేసే రాకాసులు
గొఱ్ఱెల మేపుతున్నమనుకుంట
వలస గొల్లోడు బలుస్తాండు
గొఱ్ఱెల చంపుతాండు
చచ్చిన బర్రిచ్చిన పాలను



పగిలిన సీసాలతో కొలుస్తాండు
దున్నపోతు ఈనిందంటే
దూడను కట్టేస్తమంట
మైకులు కెమెరాలురుకుతున్నయి
మనింట్ల పీనిగెలను పెట్టుకుని
వానింట కష్టానికి కంటనీరు పెడ్తున్నయి
మన్ను మసానం రోగాలు రొచ్చులు మనయి
సుఖాలు సౌలతులు వాళ్ళయి
బతుకు దెరువుకొచ్చిన నక్కను
మన ఊరి కుక్కలు ఉసి గొలుపుతున్నయి
నెత్తినెక్కి సవ్వారి చెయ్యమని
గుక్కపెట్టి ఏడుస్తున్నయి
పెళ్ళాం కట్నంతో
ప్రియురాలి కోర్కెలు తీర్చ
వీర త్యాగాలకు వడిగడుతున్నాయి
కాళ్ళు గుంజి పడదోసి
మన జుట్టు వాడికందించే
ద్రోహాలను గుర్తుపట్టాలి
మనింట్లుండి వాడిపాటపాడే
రంకు బొంకు చంద్రులను
మనమిపుడు రాహువులై మింగాలి.



జ్వలిత
H.No. 7-3-386/1, విజయనగర్ కాలనీ - 2, ఖమ్మం - 507 002

# గబ్బిలాలు...

- వి. ప్రభాదేవి
సెల్ : 98488 68089



అది 1956 సంవత్సరం!
అప్పుడు నాకు రెండేళ్ళు!
మా ఇంటికి చుట్టాలొచ్చారు
వాళ్ళు ఆంధ్రా నుండి వచ్చారట!
మాది మూడే గదుల చిన్న ఇల్లు!
మా అమ్మా నాన్నా రెండు గదుల్లో సామాను సర్దుకొని
ఒక రూమ్‌ని చుట్టాలకిచ్చారట!
ఇంకో ఆరునెలలకి రాయలసీమ నుండి
వేరే చుట్టాలు దిగారట!
మేమంతా ఒకేరూంలో సర్దుకొని
ఇంకో రూమ్ వాళ్ళకిచ్చామట!
మా అమ్మ - నాన్నల మెతక వైఖరి చూసి...
ఇహ అంతే - వాళ్ళిక్కడే వుండిపోయారట!
నాన్న ఖాళీ చేయమనరు - వాళ్ళు ఖాళీ చేయరు!
ఏండ్లు గడిచిపోయాయి -
వాళ్ళ పిల్లలూ మేమూ కలిసేపెరిగాం!
సండే వొచ్చిందంటే చాలు - నాన్న మమ్మల్నందర్నీ
చార్ మీనార్, సాలార్జంగ్ మ్యూజియం, గోల్కొండ...
అవీ వాళ్ళవే అంటారని తెలీక -
ఒక్కోరోజు ఒక్కో చోటుకి తీసికెళ్ళి తిప్పుకొచ్చేవాడు!
పెద్దయ్యాక - మాకు ఉద్యోగాల వేట మొదలైంది.
సెక్రెటేరియట్‌లో ఉద్యోగం - ఆంధ్రా అన్నయ్యకి!
సొంత టీవీ ఛానెల్ - రాయలసీమ తమ్ముడికి!
ఇహ... ఓ చిన్న 'జిరాక్స్ సెంటర్' నాకు...
బతుకు తెరువుకై!





కడుపు మండిపోతోంది... మా వుద్యోగాలు
వాళ్ళు కొట్టుకుపోతున్నారని!
1969 నుండీ పోట్లాట్టం మొదలైంది,
మా ఇల్లు మాకు కావాలని!
వాళ్ళంటారు.... ఇది మనందరిదీ అని!
ఇంటికి అసలు వారసులమైన మా అన్నా - నేనూ...
పెళ్ళిళ్ళు చేసుకొని వేరే ఇంటికి వెళ్ళిపోయాం!
కానీ, వాళ్ళు మాత్రం...
గబ్బిలాల్లాగా మా ఇంటి చూరు పట్టుకొని....
వేళ్ళాడుతూనే వున్నారు!
ఈ ఇల్లు మాది అని మేమూ...
మనది అని వాళ్ళు!
'హే కృష్ణా! - నీ వైనా చెప్పు న్యాయం!
ఇప్పుడు నీ మీదే వుంది భారం!'

వి. ప్రభాదేవి, ఎం.ఏ., ఎం.ఎడ్.,
వైస్ ప్రెసిడెంట్, శ్రీనివాస్ రెడ్డి ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ,
మునిపల్లి, జక్రాన్‌పల్లి మండలం, నిజామాబాద్.

# గోగుపువ్వు

- కొలిపాక శోభారాణి
సెల్ : 94913 67409



పెద్దముత్తెదువ.... ఎదురుంగచ్చినట్టు
ఎదుర్కుంటుంది పావురంగా...
గైయిని వాకిట్లోని... పెద్ద దర్వాజ
కాకతీయ కళాతోరణం!

అవిసెపూల... పసుపు పుప్పొడి...
పొద్దు తిరుగుడు పూల... పలకరింత
ఎండ.... చెట్లపైనుండి... సందుల గుండా దూరి
పొడలు... పొడలుగా... పడ్తుంది!

చల్లటి గాలి తెమ్మెరలతో పాటుగా...
వాహనాలు... అక్కడక్కడా... ఎడ్లబండ్లు
రేపుతున్న... దుమ్ము మేఘాలు...
బాట కిరుపక్కలా... పచ్చదనపు పలకరింత!

టన్నుల కొద్దీ... బంగారం (బెల్లం)
కానుకగా... పోగుపడ్తుంది.
అంటు - ముట్టు... నీచు... కౌసుల కతీతంగా -
సాదా... సీదా బడుగు జీవులకు... నెలవు....
కొండ దేవతల కొలువు... ఈ మేడారం!

వందల సంవత్సరాల నాడే...
స్త్రీలు శక్తి స్వరూపిణులుగా...
అన్యాయాన్నెదిరించిన ఈ నేల... ధీరోదాత్త!
తెలుగునాట... తొలి తెలుగు రాణి
రుద్రమ్మ... మాయిముంత... బందపు... ఆనవాలు

నేల ఈనినట్టు - జనసమూహాలు
కనికట్టు - కల్లా కపటాలు లేని... తేటదనాలే



బోనాలు... జంపన్న వాగు తానాలు...
అనేకానేక శ్రమల కోర్చివచ్చిన...
అనేకానేక - అస్తిత్వాల - సామూహిక
సంస్కృతుల... సమ్మేళనం...



కోట్లల్లో ఆదాయాలు
సదుపాయాలు... పూజ్యం
వానక్కొట్టుకొనిపోయే... రోడ్లు -
కుదింపుల దారుల్లో... తొవ్వకు రాని లెక్కలే అన్నీ
కోతలు... కుత్తెపు రాజ్యపు
పక్షపాత ధోరణి

రాజ్యాంగంలో... అంతా సమానం... అందరూ సమానమని
ప్రమాణాలు చేసిన నాయకులు...
స్వంత లాభం కోసం
వారికి... సకల సదుపాయాలు
నాల్గు తొవ్వల రోడ్లు -
ఇతరులకు మాత్రం...
గురివింద నీటి సూత్రాల వల్లింపులు

మితిలేక వచ్చే ఆదాయాలను.... మల్చుకొనుడు
ఈ అయిరిని - బయిరిని చేసేతనం
ఎదో... తెల్లగోలు కావాల్సే... ఉంది
ఇగ ఈతాకు వేసి తాటాకు పొందే తనాలింక... చాలు... చాలు

ఇక్కడి చిగురైనా... చేవకల్గే ఉంటుంది
ఇక్కడి మట్టి... ఎత్తిదనంతో... పోరాట స్ఫూర్తితో
వెన్ను తట్టి గోగుపువ్వై
యాదికి చెప్తుతుంటుంది

కొలిపాక శోభారాణి,
యూడీసీ, కోఆపరేటివ్, ఎలక్ట్రిక్ సొసైటీ సప్లై లిమిటెడ్, సెస్, సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా - 505 301

# జీవన తత్వం..

**- శిలాలోలిత**

సెల్ : 93913 38676



గాజు బీకరులో తొణుకుతున్న నీళ్ళలా స్త్రీ
రూపం లేదు స్థిరత్వమూ రానీరు
ఏ గాజు సీసాలో బంధింపబడినా
అదే జీవితమనుకొని సమాధాన పడాలి
ప్రాణజలం ఆమె జీవజలం ఆమె
ఏ రంగూ లేకున్నా
ఆకాశపు రంగే తనదనుకునే నీల ప్రతిఫలనాలు
చీకట్లో నల్లరంగును పులుముకోవాలి
భయానక యాసిడ్‌ను చల్లార్చే శక్తి ఆమె
ఇన్నాళ్ళూ నీటి చిత్రంలా ఒదిగిన ఆమె
తానే స్థిరీకృత రూపాన్ని ధరించింది
పెళ్లే జీవితం కాదు
జీవితంలో ఒక భాగం మాత్రమే
భర్త ఆధిపత్యమే జీవనం కాదు
హింసను ఎదిరించడమే జీవలక్షణం
ప్రేమే జీవితం కాదు
అసలు రంగును చూడగలగడమే మేధోలక్షణం
ఆత్మగౌరవపు మనోకాంతితో
మన ముందు ప్రభల్లా వెలుగుతున్న స్త్రీలు
క్రీస్తులా ధరిస్తున్న రకరకాల ముళ్ళకిరీటాల్ని
పెరికి పారేసే చైతన్యపు తునకలు స్త్రీలు
ఇగోల అహంకారాల మూలస్వభావాల్ని





ప్రశ్నించి పరిశీలించి పరిశోధించే మేధో జీవులు స్త్రీలు
ఒక్కటై ఒక్కరై సమిష్టి చైతన్య దృక్పథమై
దిశానిర్దేశం చేసే ఆధునిక స్థితప్రజ్ఞులు స్త్రీలు
హిమాలయాలంత మానసిక శక్తితో
అనుభవాల ఇంధనంలో
బతుకు బాటలో పల్లేరు కాయల్ని ఏరిపారేసి
కొత్త బాటను సృష్టించుకున్న శిల్పులు స్త్రీలు
రాతి నుంచి పూలను సైతం వెలికితీసిన సృష్టికర్తలు స్త్రీలు
సమసమాజంలో స్త్రీపురుషుల సమానస్థితి కొరకై
పోరాడి పోరాడి గెలిచి నిలిచిన సంగ్రామ వీరవనితలు

శిలాలోలిత,
H.No. 1-7-9/1/3, Sufighar, Chaitanya Puri, Hyderabad - 500 060.

# 'జో' కొడ్తారు జాగ్రత్త!

- కె. విజయలక్ష్మి
సెల్ : 98488 68075



తేలుకుడితే మందు ఉంది
పాము కాటుకి మందు ఉంది
కుక్క కరిస్తే మందు ఉంది
ఎద్దు కుమ్మితే మందు ఉంది

కానీ

మేక వన్నె పులులైన
'సీమాంధ్ర పాలకుల'
పంజా దెబ్బకి ఏ మందూ లేదు!

విద్యారంగంలో,
ఉద్యోగ రంగంలో,
వ్యవసాయరంగంలో,
విద్యుత్తు పంపకంలో,

ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాల్లో
ఎక్కడ చూసినా... దోపిడే... దోపిడీ!

ముల్కీ నిబంధనలూ...
అష్టసూత్రాలూ...
ప్రభుత్వ ఉత్తర్వులూ...
గిర్‌గ్లానీ నివేదికలూ...
ఏ దోపిడీలనీ ఆపలేదు!






'మనమంతా తెలుగువారం -
తెలుగువారందరమూ
కలసి ఉందామ'ంటారు వారు!

కాలు మనదే అయినా
గాంగ్రిన్ వస్తే -
కాలు తీయించుకుంటాంగానీ
'అమ్మో, అది మన కాలు కదా'అని -
దాన్నలాగే ఉంచేసుకుని మనల్ని
మనం బలి పెట్టుకోం!

ఖబర్దార్!
మమ్మల్నింకా జోకొట్టాలని చూడొద్దు మీరు!
మాకు ఏ కమిటీలూ వద్దు,
మాక్కావలసింది 'ప్రత్యేక తెలంగాణా'!

కె. విజయ లక్ష్మి, ఎం.ఎ., బి.ఎడ్.
రాధాకృష్ణ మెడికల్ & జెనరల్ స్టోర్స్, బోధన్, నిజామాబాద్.


గాయాలే... గేయాలై!



# తెగించి కొట్లాడుడే

- తిరునగరి దేవకి దేవి
సెల్ : 99496 36515

ఆదినుండి అవమానాలతో అణచివేయబడ్డ అతివను నేను
నాదెప్పుడూ ఎడతెగని ప్రయాణమే
నా ఎడారి ప్రయాణంలో ఒయాసిస్సుల జాడ మృగ్యం
నిజాం కాలంలో ఆడబాపగా సర్వహక్కులూ కోల్పోయి
శ్రమతోపాటు శరీరాన్నీ పరాయీకరణ చేయబడినదాన్ని
ఆరు కాలాలు ఆరాటపడ్డా పట్టెడన్నానికి దూరమైనదాన్ని
పోరాడకపోయినా జీవచ్ఛవాన్నవుతున్నందుకు
అచ్చమాంబనై ఆయుధం పట్టినదాన్ని
పాలకుర్తి అయిలమ్మనై
నా పాలు గింజల్ని దక్కించుకున్నదాన్ని
పోరాటమే ఊపిరిగా వడిసెలతో
శత్రువును ఉక్కిరి బిక్కిరి చేసినదాన్ని
కారం ముంతలతో
కావరమెక్కిన శత్రువుల కాళ్ళకు బుద్ధి చెప్పించినదాన్ని
సంఘం కోసం వంటలక్కగా మంత్రసానిగా చాకలిగా
చలివేంద్రంగా సత్రంగా సమస్తమై శ్రమించిన దాన్ని
కానీ సోకాల్డ్ విమోచనానంతరం
దూరంగా విసిరి వేయబడ్డ యూస్ అండ్ త్రోని
కొత్త సీసాలో పాత సారాయిలా
నిజాం నిరంకుశ పాలనిపుడు కొత్తరూపాన్ని సంతరించుకుంది.
పాలకులంతా వలసవాదులో
వాళ్ళ గంగిరెద్దులో ఎవరైతేనేం
ఎప్పుడూ నాకు మొండిచెయ్యే
పుస్తెకట్టినోడికి తోడుగా సందట్లో సడేమియాగా
పాలకుడూ నా యిల్లిటపు మొగుడే



నా ఆస్తి యావత్తూ వాడి పుట్టింటికే తరలింపు
నీళ్ళులేక నిధుల్లేక అప్పులందక నా రైతన్న ఆత్మహత్యలో
ఎక్స్‌గ్రేషియా ఎగ్గొట్టివేతలగ్గానూ
నేనిపుడు అక్రమ సంబంధం అంటగట్టబడినదాన్ని.
చేనేత పరిశ్రమ చేదు అనుభవంకాగా
తండ్రి పరమపద పలాయనంతో
మగ్గమే లక్ష్యంగా కులవృత్తిని కొనసాగిస్తున్నదాన్ని
కోట్లకు పడగెత్తిన సీమాంధ్ర కుబేరులకు
బంజారాది గుట్టలను కట్టబెట్టి
మూసీనది మురికి కాల్వపక్క
నా ఆరోగ్యాన్ని సమాధి చేసుకున్నదాన్ని
వలస కూలీల కబ్జా పెత్తందారీతనంలో
మాతృత్వమే ఫణంగా అంగట్లో కన్నపిల్లల నమ్ముకొంటున్నదాన్ని
కాకుంటే శరీరమే పెట్టుబడిగా
వ్యాపారం కొనసాగిస్తున్నదాన్ని
ఆంధ్రుల దురాక్రమణలో అడవి మాయంకాగా
కాగితబ్బతుకమ్మే దిక్కైనదాన్ని
చాపకింది నీరులా ప్రవేశించిన
కోస్తాంధ్ర భాషా యాసా సంస్కృతులే
అసలు సిసలైనవని భ్రమింప చేయబడినదాన్ని
అభద్రతకు లోనైన నా పిల్లల ఆత్మాహుతులతో కడుపుకోత
శిశుపాలుడి తప్పులనధిగమించి
నీ దుర్మార్గాలు తారాస్థాయిలో ననుభవిస్తున్నదాన్ని
ఇంకానా ఇకపై చెల్లవు
అపర కాళికనై తెగించి కొట్లాడుడే తెలంగాణ వచ్చేదాక



తిరునగరి దేవకి దేవి
MIG - 2, APHB colony, ఆలంపల్లి రోడ్, వికారాబాద్ - 501 101

# తెలంగాణ తల్లి ఎత

**- డా॥ అడువాల సుజాత**
సెల్ : 99895 58678



తల్లడిల్లుతుంది
తల్లి తెలంగాణా ఎతతో!
తెలంగాణా
కోటి రతనాల వీణ అప్పుడు -
ఇప్పుడైతే...
తీగ తెగిన వీణ -
ఈ తల్లి ఎద కోత.
ఇసం కువ్వారం లేనోళ్ళు -
ప్రేమకు ప్రాణమిచ్చేటోళ్ళు
అమాయకులు
తెలంగాణా తెలుగోళ్ళు!
ఇటీటు రమ్మంటే -
ఇల్లంతా నాదని
మాది మాకు గాకుండా జేస్తుండ్రు
నీళ్ళు లేకపాయే -
నిలువ భూమి లేకపాయే
నౌకర్లు లేకపాయే -
చాకిరీ మా పాలాయే
మాట నచ్చక పాయే
భాష యాసాయే.
తెలంగాణ తెలుగంటే....
'గుండాల మాట'నుకున్నర?
కాదు...
ఇంపుసొంపుల గుర్గి -
సింగారాల బుడ్డి
తెలంగాణ తెలుగు



ఎద మెత్తని తనం -
కల్తీలేని కన్నతల్లి ప్రేమసొంటిది!
మా భాషనూ...
మా మంచితనాన్నీ...
మా అమాయకత్వాన్నీ...
ఆసరా చేసుకొని అణిచేసింద్రు.
ఇప్పుడు...
మా ఎదలలో
నిప్పుల కుంపటి
రాజుకుంది, రగులుకుంది!
ఈ మంటలలో
మా నెత్తురు మసులుతుంది!
అడ్డమొచ్చినోన్ని
అడ్డంగా నరుకుతం!
తెలంగాణా పొద్దుపొడుపు
వచ్చేదాకా పోరాడుతం!
ఎదురు తిరిగినోన్ని
ఎమలోకానికి పంపుతం!
ఒక్క మాటి
ఒక్క మాట మీదుంటం!
తెలంగాణా గడ్డ మీది
పులి బిడ్డలం మేం!
తెలంగాణా తల్లి ఎత
తీరే దాకా పోరాడుతం!



డా॥ అడువాల సుజాత, ఎం.ఎ., బి.పి.ఇ., ఎం.ఫిల్, పిహెచ్.డి.
H.No. 2-10-1223, జ్యోతి నగర్, కరీంనగర్ - 505 001. Email Id: aduvalasujatha@yahoo.in

# తెలంగాణా... నే మెట్టినగడ్డ

- మారుబడి సుజాత
సెల్ : 93464 07307



వందరోజులు అయిపోయాయప్పుడే...
తెలంగాణ పోరు మొదలెట్టి.
ఆ మధ్య పిలిచారు నన్ను...
తెలంగాణాకి మద్దతుగా
సంఘీభావం తెలుపుతూ...
దీక్షలో పాల్గొనమని!
వెళ్ళాను! కూర్చున్నాక... ఆలోచించడం మొదలెట్టా!
మా తాతముత్తాతలు కృష్ణా జిల్లా వాళ్ళు...
మరి నేనీదీక్షలో కూర్చుంటే నా వాళ్ళకి విరుద్ధంకాదా?
నే పుట్టక ముందే,
తన కాలేజీ రోజుల్లోనే
మా నాన్నగారు ఇక్కడికి వలసవచ్చారు!
నేను పుట్టింది నిజామాబాదులో...
పెరిగింది గుంటూరులో!
నా చిన్నప్పుడు కూడా
తెలంగాణా - ఆంధ్రా గొడవలు జరిగాయట!
మా నాన్నగారు తెలంగాణాకే మద్దతిచ్చారు తప్ప -
ఈ ప్రాంతాన్ని వీడిపోలేదు!
ఉద్యోగం - ట్రాన్స్‌ఫర్ల పరంగా
ఆంధ్ర - తెలంగాణా ఊళ్ళన్నీ తిరిగాము.
కానీ ప్రతీ ఎండాకాలం... మా సెలవులన్నీ
మా నిజామాబాద్ అమ్మమ్మ ఇంట్లో...
సరదాగా గడిపే వాళ్ళం!



నా తల్లిదండ్రులకు ఈ ప్రాంతం ఎంతగా నచ్చిందంటే...
బోధన్‌కి నన్ను కోడల్ని చేశారు!
ఇంతలో...
నాకు నచ్చిన, నేను మెచ్చిన ఉద్యోగం -
నాకు ఆర్మూర్‌లోనే దొరికింది -
కొంత కాలానికి నాకో కొడుకు!
వాడు పుట్టింది గుంటూరులో... పెరిగింది ఆర్మూరులో!
ఒక రోజు...
నా కూతురు పుట్టిన మూడున్నరేళ్ళకే...
అనారోగ్యంతో కన్ను మూసింది,
ఈ తెలంగాణా మట్టిలోనే కలిసిపోయింది!
ఈ గడ్డ మీద ప్రేమో,
ఈ మట్టి మీద అభిమానమో
నేనిక్కడే సెటిలై -
తెలంగాణా వాసినయ్యాను!
వలస వచ్చిన మేమే
ఈ గడ్డ మీద ఇంత అనుబంధం పెంచుకుని -
ప్రత్యేక రాష్ట్రం కోసం ఉద్యమిస్తూంటే...
ఈ గడ్డతో సంబంధం లేకుండా
ఎక్కడో ఉన్నవారు
ఇక్కడి విషయాలు తెలిసినట్టు
పనిగట్టుకొని అడ్డంకులు సృష్టించడం
ఎంత వరకు సమంజసం?



మారుబడి సుజాత, బి.కామ్., బి.ఇడి.
Adminstrative Officer, విజయ్ హైస్కూల్, ఆర్మూర్, నిజామాబాద్. - 503 224

# తెలంగాణ పండుగొచ్చింది

- డా॥ వి. త్రివేణి
సెల్ : 99514 44803



తడారి పోయిన తోవలు వదిలి -
మా ఊరి పొలిమేరకు నేను వచ్చిన!
గుండె నిండా కమ్మదనాన్ని నింపుకొని -
తెలంగాణ పండుగొచ్చింది ఎదురుగా!
ఊరంతా నికార్సుగా నిలుచుంది!
తెలంగాణ ధీరత్వాన్ని ప్రకటించింది!
ఊరు పెళ్లికూతురైంది -
ముసి ముసి నవ్వులు రువ్వింది!
ఆడపడుచులం అందరం కలిసినం -
మా సంబరం అంబరం అంటింది!

మామిడాకుల మమతల తోరణాలు
కుసుమానురాగాల విరిమాలలు
ముత్యాల ముగ్గుల మురిపాలు
రతనాల కాంతుల రంగవల్లులు
పసిడి పసుపు పచ్చదనాలు
సిందూర తిలకపు ఎర్రదనాలు
హరివిల్లు వరుసల వర్ణాలు
గడపలోగిళ్లకు తెలంగాణ సిరులు
ఆత్మీయ బంధమై స్వాగతం పలికాయి!

గూనుగు పువ్వు గూడంత కూడింది.
తంగేడు పువ్వు తడికంత తట్టింది.
ముద్దబంతి పువ్వు మురిపెంగ మొత్తింది.
ముత్యాల పువ్వు ముచ్చటగ ముట్టింది.
బీరంకె పువ్వు బిరుసుగా పట్టింది
బంగారు బతుకమ్మ సింగారమయ్యింది!
బతుకమ్మ అందం సృష్టికి బంధమయ్యింది!



పచ్చని ముంగిట అలుగులో
బతుకమ్మ ఆటాపాట -
తెలంగాణ బతుకు బాట!
కష్టాలు కడతేరుతాయ్.
సుఖాలు సమకూరుతాయ్.
సంతోషాలు అంది వస్తాయ్.
బాధలు ఒడ్డుకొంటాయ్.
బతుకమ్మ ఆటాపాట -
భక్తికి, ముక్తికి
మహిమలకు, మానవ విలువలకు
తెలంగాణ బతుకు బాట!



పాటకు ఆటకు మధ్య తాళం
చప్పట్ల శబ్దం హోరెత్తుతుంది!
గుండె గొంతుకల్ని తవ్వుతుంది!
నరనరాన అనురాగం చిమ్ముకొస్తుంది!
బతుకమ్మ పూల ముద్ద కాదు
కడలి కన్నీటి ముగ్ధరాలు!
వీర వనిత - 'నక్క ఆండాళ్లు' చరిత!
తెలంగాణా బతకమ్మ పాటకి ఘనత!
ప్రేమ బంధానికి సాక్షాత్కారం
మిరుమిట్లు గొలిపే అశనివేశం
తెలంగాణ ప్రజల నిండు జీవితం
బతుకమ్మ పండుగ కీర్తి కిరీటం.

బోనం శక్తి స్వరూపానికి ప్రతిరూపం
బోనం బ్రహ్మాండానికి అమృత భాండం
బోనం సృష్టిని వెలిగించే జ్యోతి స్వరూపం
గ్రామ దేవతల కరుణా కటాక్ష వదనం
తెలంగాణ బోనాల జాతర సంబరం
తెలంగాణ సంప్రదాయానికి తార్కాణం

మమతానురాగాల్ని మాలగ చేసి
బోనం చుట్టూకట్టి, సున్నం బొట్టూపెట్టి
పసుపు కుంకుమలు నిండార పూసి
వేపాకు కట్టలు పేర్చి
ముస్తాబైన బోనం
మహా వైభోగం
అమోఘం - అద్వితీయం!
బోనంలో పెట్టిన పచ్చన్నం
శక్తిమాతకు పరమాన్నం
బోనమొక అక్షయ పాత్ర!
జ్యోతి ఒక ఆరని జ్వాల!!

గర్భగుడిలో తల్లి మంగళ స్వరూపిణి
పసుపు నిండిన పచ్చని ముఖవర్చస్సుతో
తిలకం దిద్దిన సూరీడి కిరణాలతో
సర్వాంగ సౌందర్య కాంతి రేఖలతో
తల్లి రూపు, కొనకంటి చూపు
దిక్కుల్ని శాసిస్తున్నాయ్ -
ప్రకృతిని అర్థిస్తున్నాయ్!!
పెద్దమ్మ తల్లి రక్షణ - ఊరికి ఊపిరి
మైసమ్మ తల్లి శక్తి - యువతకు యుక్తి
పోచమ్మ తల్లి ధైర్యం - స్త్రీకి శ్రీకారం
ఆదిశక్తి ఆదిసృష్టికి ఆత్మ నైవేద్యం

తల్లీ బయలెల్లింది!!
అమ్మా బయలెల్లింది!!
వేలవేల జ్యోతుల కాంతులతో
పోతురాజుల వీర కృత్యాలతో
డప్పు దరువుల ధ్వని విన్యాస నినాదాలతో
శిగమెత్తిన దేవతా శక్తి ప్రతిఫలనాలతో
మేకపోతుల బలిదానాలతో



కోడిపెట్టల కోరి దానాలతో
సమర్పించే మొక్కు బడులు
భక్తుల కష్టాల ఇరుముడులు!

తల్లీ!



నీవు రక్షించే కల్పవల్లివి
సంపదలనిచ్చే సిరివల్లివి
ముత్యాలమ్మ ముంగిట్లో
నూకాలమ్మ కొలువులో
ఆటలమ్మ ఒడిలో
ఎల్లమ్మ ఎదలో
సేద తీరుదాం!
తెలంగాణ పండుగకు మళ్లొద్దాం!!

డా॥ వి. త్రివేణి, అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు అధ్యయన శాఖ,
తెలంగాణా యూనివర్సిటీ, డిచ్‌పల్లి, నిజామాబాద్ - 503 175

# తెలంగాణా పిలుస్తోంది!

- సుజాత
సెల్ : 90143 91566



పిలుస్తోంది తెలంగాణ... కన్నీటి కడలిగా!
మీ హృదయం కరగడం లేదా?
గుండెలు మండటం లేదా?
అణువణువూ... ఆక్రోషించడం లేదా?

అగ్గిపుల్లలంటించే కుటిలాత్ములు వున్నప్పుడు
అడ్డుపుల్లలేసే కుళ్ళుబోతులున్నప్పుడు...
కళ్ళుండీ చూడలేని కబోదులున్నప్పుడు...
కాళ్లుపట్టి లాగే కుత్సితులున్నప్పుడు...
నడక సాగించటమే బరువౌతుంది!
'తెలంగాణా' అందని ద్రాక్షపండౌతుంది!



రెండడుగులు వెనకబడ్డా -
మూడడుగులు ముందుకే!
అడ్డొచ్చిన వాళ్ళని
ఆత్మబలంతో అణగదొక్కి
కమ్మకత్తి చేతబట్టి కొమ్మవంచి...
ద్రాక్షగుత్తి అందుకొందాం - రండి!

అందని దానిని అందుకోగలిగినపుడే
అందిన దానికి 'అందం' రెట్టింపవుతుంది.
అందమైన 'తెలంగాణ' ఆనందమవుతుంది -
మన 'తెలంగాణ' మనకు అపురూపమవుతుంది!

సుజాత, టి.పి-2
Z.P.H.S, అర్గుల్, జక్రాన్‌పల్లి, జిల్లా : నిజామాబాద్.



# తెలంగాణ సోదరా !

- పి. రాజేశ్వరి
సెల్ : 92915 49051



మట్టిలోన పుట్టి వానలోన నాని
ఎండలోన కాగి ఏరువాకకై
ఎదురుచూసే నెత్తుటి కనుపాపల
నయనాలతో మెరిసే ఓరన్నా!

బానిస బతుకులొద్దంటూ -
నీది నాది అనే భేదభావం మనకెందుకు?
తరాలు మారినా మారని తలరాతల వెతలెందుకు?



కాళ్ళు మొక్కుతా బాంచనంటూ
మోచేతి చీకటి బాధలెందుకు?
మన ప్రక్కలోన బల్లెమై
మన బ్రతుకుకే తూట్లుపెట్టి
తడిగుడ్డతో గొంతుకోసే
కసాయి పొరుగు నీడ
పాడెకట్టెకు పూలదారిరా ఓరన్నా!

నైజాం అడ్డుగోడగా నిలిచే ఆనాడు
గ్లోబల్ అభివృద్ధి అంటూ
తెల్లవాడిని తలదన్నే కుట్రా కుతంత్రాలున్న
చిరునగవుల మేలిముసుగును
చిద్రం చేసే చిరుదివ్వెగ మారరా ఓరన్నా!
మాయాజాలపు మత్స్య యంత్రంగా
మరో తరానికి నాందీ కాకురా ఓరన్నా
తెలంగాణ మనదంటూ గళమెత్తి పాడరా!
దిగంతాలదాకా తెలంగాణ సోదరా!

పి. రాజేశ్వరి,
W/o. పి. రాజీరు, H.No. 3-2-186/1 విద్యానగర్ కాలనీ, కొత్త గూడెం, ఖమ్మం.

# దప్పు సప్పుల్లతో దండోరేసే నా రోజెన్నడో

- జూపాక సుభద్ర
సెల్ : 94410 91305



ఓ పెద్దమనిషన్నట్లు
నేను'కోటిరతనాల వీణ'నేమోగాని
కోటిగాయాల గడ్డను అనేది నిజం
యింకా సబ్బండ సమ్మక్క సారక్కలకు అడ్డానని
పోరాటాల సాల్లు బోసిన పోషమ్మ మైసమ్మ
పుప్పలమ్మ పూరడమ్మల
బిడ్డనని మాత్రమే తెలుసు
నా ఆడిబిడ్డెలు ఎండ కన్నెరగనోల్లుగారు
ఏడుముట్టెల్లకాలం పిల్లాది మారకాంచి
పోరుల పొర్లాడుతున్నోల్లు
గానాడెన్నడో సాయుధ పోరాటంల
తుపాకులు బట్టి తూటాలు తొడుక్కొని
గడీలల్ల బరిబాతల బత్కమ్మలాడిచ్చిన
దొరల కోరల్ని వొలిచినోల్లు
మిలట్రీ మిడతల దండు
కండ్లల్ల కారం ఫిరంగులు జల్లి
వూరావలికి వురికిచ్చినోల్లు
గియ్యాల పొట్ట తట్టల వెట్టుకొని పట్నంబోతుండ్రు
రోడ్లకు కంకరై, భవంతులకు సిమిటై యిటికై
యిండ్లల్ల పాసిపనై
బిడ్డలకు బుక్కెడు బువ్వ బెట్టలేక
అడ్డాల్నాడే అమ్ముకుంటుండ్రు



అడ్డాల మీద కుప్పబోసిన కూలి సరుకైతుండ్రు
బతుకే సావైనకాడ అక్షరాల మెతుకులకు యాడికి బోదును
యెన్నెలై పారిన నాయేటి యెదలు సీకటి డొక్కలైనయి
సింగిడై పొంగిన నా గొలుసుకట్టు కలలు సెదపురుగులు దిన్నయి
నా పల్లె సెట్టుకు ఆకు అంటుత లేదు
సిన్నబొయి  కూకుండనీకి సిరిమల్లె పందిర్లు పాడైనయి
అదేందో నా పుట్కే మంచిదిగాదు! బేకార్ పుట్క!
నన్నెవరు బుట్టించింద్రో ఏమోగాని
ఏనాడు కడుపు నిండదిని కండ్లార కునుకుదీయలే
నా గడ్డమీదికొచ్చినోడు సచ్చినా బోడెందుకో
యేడలేని బెల్లంగడ్డలు నాతాన్నే వున్నయా
ఆదెపాయె బత్కనియ్యంటే
నన్నే అంగట్ల అమ్ముతుండ్రు తక్కెట్ల జోకుతుండ్రు
నా రూపురేకల్ని నామరూపులు లేకుంట నమిలి మింగుతుండ్రు
నా మట్టిల బతికి బట్ట గట్టి కోట్లకు కోటలు గడుతుండ్రు
నా జాగ నాగ్గావాలంటె
'ఛత్' నీయయ్య 'విడదీస్తున్నరు' అని
సమైక్యరాగాలు రాజేస్తుండ్రు
గీల్లందర్ని మోసి మాడంత కాయగాసిందిరా బిడ్డా!
నా కడుపు నిండ నీళ్లున్నయి,
నాగుండెనిండ గనుల గరిశెలున్నయి
నా నెత్తినిండ పోరాటాల పొక్కిల్ల తొక్కిడున్నది
అయినా నా పూర్లన్ని వుపాసాలె వుంటున్నయి
గా పెద్దమనుసులు సావువాల్ల నెత్క కట్కపోను
బలిమీటికి బాసింగం గట్టి అడివిల ఆగం జేసింద్రు

‘కలిసుంటే కలదు సుకమని’ నన్ను కల్లోలం జేసింగ్రు
నా బిడ్డెలు పిడికెడు బువ్వకు అడివిల అన్నలైతుంగ్రు
మస్కట్ తొవ్వల్ల మలిగి పోతుంగ్రు
గాపొద్దు నా సెరని యిడిపించనీకి కొట్లాడిన నా పోరగాండ్లని
పిట్టలోలె కాల్చి సంపితే
గీనాడు కనిపించని కుట్రలు పెట్రోలై హత్యలు జేస్తూ...
నన్ను సావుల రేవు జేస్తున్నరు
ఎన్నేండ్లున్నా వేరుదప్పది,
ఎప్పటికైనా వలసపక్కల బల్లెమై
మేలుకొనేవుంట
వాడెన్నిసార్ల ధోకజేసినా సల్లారని బూడిదిని



వానికి నాలుగుగాదు నలభై తల్కాయలుండొచ్చు
నేను వూరూరికి నినాదమై వురుముతూ
ధూంధాంతో దిక్కుల్ని దుక్కుదున్నినా
వాని కమిటీ తంత్రాల తాయత్తుల్ల కాటగల్సిన
సూరుకు సెక్కిన సుట్టాకునైన,
నేను నేనుగ నిలబడందే
ఎల్లి ఎల్లమ్మ, నర్సిగాడు నర్సయ్యలు కారురా బిడ్డలారా
నా పీడలకు పాడెగట్టి నా గడ్డమీద నాకు
బొట్టువెట్టి బోనమండి అస్సోయిదూలాతో
దప్పు సప్పుల్లతో దండోరేసే నా రోజెన్నడో...


జూపాక సుభద్ర,
13-6-462/ /27, భగవాన్ దాస్ బాగ్, తాళ్ల గడ్డ, హైదరాబాద్ - 500 067




# నా ఇంతజారు...


- శిరీషారాణి
సెల్: 94402 87378




ముగ్గురు పెండ్లాలం ఉయ్యాలో...
మా మొగనికి మేము, ఉయ్యాలో!
    సూడ సక్కనోడనీ - ఉయ్యాలో...
    నమ్మి పెండ్లి జేసుకుంటి, ఉయ్యాలో!
పెండ్లైన కొత్తలా - ఉయ్యాలో...
ఆడెంత మాటన్నడూ ఉయ్యాలో!
    ముగ్గురూ సవతులను ఉయ్యాలో...
    కలిసి ఉండమన్నడూ, ఉయ్యాలో!
ఉండనని మొండికేత్తె ఉయ్యాలో...
తొక్కి అన్గవెట్టిండు, ఉయ్యాలో!
    ఇగ వోతెవాయెననీ ఉయ్యాలో...
    ఇన్కారు జేసినా, ఉయ్యాలో!
గిప్పుడా గప్పుడా ఉయ్యాలో...
ఏండ్లకింది ముచ్చటా, ఉయ్యాలో!
    ఆ పొద్దు నుంచెల్లి ఉయ్యాలో...
    నా కష్టాలు జెప్పలేను, ఉయ్యాలో!
ఇద్దరు సవతులనూ ఉయ్యాలో...
పెబ్బలను జేసిండు, ఉయ్యాలో!
    అండ్లొక్కతైతె ఉయ్యాలో...
    మా గంపగయ్యాళీ, ఉయ్యాలో!
పాడి పంటలు నాయి ఉయ్యాలో...
ఒర్రెలు సెలకలు నాయి, ఉయ్యాలో!
    వాగు వంకలు నాయి ఉయ్యాలో...
    వనరులన్నీ నాయి, ఉయ్యాలో!

నా మొగడెసుంటోడు ఉయ్యాలో...
నీళ్ళు సవతింటికి పారిస్తుండు, ఉయ్యాలో!
దాని పిల్లలేమోఉయ్యాలో...
రాజుల్ని జేసిండు, ఉయ్యాలో!
నా పిల్లలకేమో ఉయ్యాలో...
చిప్ప చేతిల పెట్టిండు, ఉయ్యాలో!
సవతి పిల్లలేమోఉయ్యాలో...
రాజ్యమేల వట్టింగ్రు, ఉయ్యాలో!
నాకు పుట్టిన పిల్లలు ఉయ్యాలో...
అనిగి పోవట్టింగ్రు, ఉయ్యాలో!
పెద్ద కొలువులేమో ఉయ్యాలో...
దాని కొడుకులకంట, ఉయ్యాలో!
కూలి బతుకులేమో ఉయ్యాలో...
నా పిల్లలకంటుండు ఉయ్యాలో!
బక్కగున్నదానికేమో ఉయ్యాలో...
ఆరు మూరల చీర ఉయ్యాలో!
బలువుగున్న నాకు ఉయ్యాలో...
సెల్ల వారేసిండు ఉయ్యాలో!
గిదెక్కడి న్యాయమనీ ఉయ్యాలో...
నా పిల్లలడుగుతుంగ్రు, ఉయ్యాలో!
ఒక్కల్లా ఇద్దరా ఉయ్యాలో...
పోరుబాట వట్టింగ్రు, ఉయ్యాలో!
వందలకొద్ది నా పిల్లలు ఉయ్యాలో...
పానాలు ఇడిసింగ్రు ఉయ్యాలో!
కుడిచేత నా సొమ్ము ఉయ్యాలో...
ఇచ్చినట్టే ఇచ్చి ఉయ్యాలో!
ఎడమచేత వాడు ఉయ్యాలో...
తీస్కుంటనంటుండు, ఉయ్యాలో!



ఎవనబ్బసొమ్మనీ ఉయ్యాలో...
ఎవడేంది ఇచ్చేది, ఉయ్యాలో!
గా ఇచ్చుడటువెడితె ఉయ్యాలో...
మల్లొక్క గొల్లెం పెట్టవట్టిండుఉయ్యాలో!
ఇల్లిత్తడటగానీ ఉయ్యాలో...
పెద్దిల్లుంచుకుంటడట ఉయ్యాలో!
పెయ్యంతున్నగనీ ఉయ్యాలో...
గుండెకాయలేనట్టు ఉయ్యాలో!
నా పిల్లలు పెద్దగైంగ్రు ఉయ్యాలో...
ఆల్లే గొట్లాడుతరు, ఉయ్యాలో!
సవతి కొడుకుల లెక్క ఉయ్యాలో...
నా కొడుకులు సుత గూడుతరు, ఉయ్యాలో!
ఇగ ఆల్లు ఊకుండరు ఉయ్యాలో...
బొండిగే పిసుకుతరు ఉయ్యాలో!
నా సొమ్ము, నా జాగా ఉయ్యాలో...
నాయి నాకస్తయీ, ఉయ్యాలో!
ఆ పొద్దు కోసమే ఉయ్యాలో...
నా ఇంతజారమ్మ ఉయ్యాలో!



ఏ. శిరీషా రాణి
P.E.T, Z.P.H.S, గూడెం, ముస్తాబాద్ (మం॥), కరీంనగర్ జిల్లా.



# నాక్కాత్త గీరే

- జి. విజయ లక్ష్మి
సెల్: 97035 64878

నాక్కాత్త గీరగానే వుంది
అసూయల అగ్గిగుండంలొ దిట్టిదీసిన ఉప్పుకల్లుమల్లె
పెటాపెటా మీరు పేలిపోతావుంటే
నాగుపాములల్లె బుసబుస బుస పెడతావుంటే
టక్కుటమారపు పేమల్లో మీరు బతుకుతావుంటే
నాక్కాత్త గీరగానే వుంది

అందరి ఆడంగుల్లాంటిదాన్ని కాదంటున్నందుకు
పోగురుబోతునని ఆడిపోసుకుంటున్నందుకు
మీలాగ రంగులుమార్చే ఊసరవెల్లిని కానందుకు
ఎదటోల్ల నోట్లో దుమ్ముకొట్టి
అంగులు టింగులు పెంచుకొని
టింగురంగా అనుకుంటూ
రొట్టెముక్కకాడ కొట్లాడుకునే
కుక్కల్లో ఓ కుక్కని కానందుకు
నాక్కాత్త గీరగానే వుంది

బుడబుక్కలాడి ఎదట నోరు మెదపకుండా
జంగం ఎనకాతల మొరుగుతున్న
కుక్కల సోకండాలు ఇంటావుంటే
నాక్కాత్త గీరగానే వుంది

ఎదటాల్లకి గుంటదీసి గంటవాయిచ్చాలనుకునే
జిత్తులమారి గోతికాడ గుంటనక్కల గుండెలల్లొ
ఉండేలు దెబ్బనయ్యానని
నాక్కాత్త గీరగానే వుంది



దూరేదేమో దొమ్మరి గుడిసె
సెప్పేదేమో సీరంగనీతన్నట్టు
గురిగింజలన్నిటికి కింద నలుపె
దొమ్మరోడి సేతి గడమీన
ఒడుపుగా నడిసే సత్తా వుండందుకు
గురిగింజల్లో పగడపూసై మెరుత్తుండందుకు
నాక్కాత్త గీరగానే వుంది



మీ కాలచ్చేపం బటానీలుగా
మా బతుకుల్ని నవిలి మింగేప్పుడు
కీరితి దెయ్యాల పూనకాలతో
మీరంతా పూగిపోయ్యేప్పుడు
నేను యాపమండనై మిమ్మల్ని
ఈరంగమాడిత్తావుంటే
నా సామిరంగా
నాక్కాత్త గీరగానే వుంది

సద్దిబువ్వ మింగిందానికి
మొగుడాకలేం తెలుత్తదన్నట్టు
కడుపులో సల్ల కదలకుండ
సల్లటి గదులల్లొ
సరదాగా ఎన్ని పోసుకోలు మాటలైన జెప్పొచ్చు
ఆడలేక మద్దెల వోటిదనే
మీలాటి బుట్టబొమ్మలకి
దండోరా ఏసి మరీ జెప్తాండ
నా కొప్పులో తుప్పట్టిన సెంపిన్ను సాలు
మీరు రగతాలు కక్కడానికి
బతుకు వయికుంటపాలిలో
సిన్న పెద్ద పాముల్ని నరుక్కుంట

నిచ్చెనెక్కి పైకొచ్చిన
ఇక నన్నాపటం
మీ వైకుంటాసుడి తరంగాదు
కరక్కాయల్లా మిమ్మల్ని
అరగదీత్తన్నందుకు
మీ కల్లల్లో కలిగ్గమై
మంటలు బెడుతున్నందుకు
నాక్కాత్త గీరగానే వుంది

నిజం నిప్పురవ్వని
మీ గుప్పిల్లలో మూసిపెట్టి
బూడిదని సెపితే
అరసేతుల్ని కాల్చేసి
కణకణమండే కణికలాగ
పెజల కంటపడకుండా వుండదు
మేకల్ని నవలే మీ అసంటి తోడేల్లని
సీల్చి సెండాడతానికి
పులినై గాండ్రిత్తన్నందుకు
సింహాన్నై గర్జిత్తన్నందుకు
నాకు
శాన శాన శాన గీరగానే వుందెహె!

జి. విజయలక్ష్మి, ఎం.ఏ.(లిట్),
రచయిత్రి & జర్నలిస్ట్, డోర్ నెం. 2-2-1105/A/7/1, బాలాజీ అర్కేడ్, తిలక్ నగర్, నల్లకుంట, హైద్రాబాద్ - 500 044



# నా తెలంగాణా

- డా॥ వి. శోభ
సెల్: 99492 29955



తెలంగాణా ముద్దు బిడ్డలు -
అమరులైరి తెలంగాణకై!
ఉద్యమాల ఉయ్యాలలో -
ఊగింది తెలంగాణా!

బుస కొట్టింది తెలంగాణా -
బిస తిప్పింది తెలంగాణా!
కుదిపింది సమైక్యాంధ్రను -
కదిపింది కేంద్ర సర్కారును!

శ్రీకాంత్ ఆత్మాహుతి -
శ్రీకారం చుట్టె పోరుకు!
అరె, ఉస్మానియా, కాకతీయలు -
అందుకున్నయ్ పగ్గాలను!

తెలంగాణా పల్లెలన్నీ -
పోలిసోళ్ళ షహరులాయె!
గోదావరి కృష్ణమ్మలు -
వాకిట్ల పారుతుంటే -
అరె, తెలంగాణ భూములన్నీ -
ఎందుకిట్ల ఎండిపోయె?

పట్నాల భూములేమో
రియల్ దంద పాలాయె!
నీళ్ళేమో మలుపుతుండ్రి!
నిధులేమో మింగుతుండ్రి!
అరె, నౌకరీలు గుంజుకొంటిరి -
నిజాలన్ని కాలరాస్తిరి!

'పవరు' పంచే రామగుండం -
తలపించే సుడిగుండం!
కోస్తాకిచ్చె పన్నీటిని -
తెలంగాణాకి కన్నీటిని!

బోరుబావే దిక్కాయె -
పోరుబాటే పక్కాయె!
అరె, సింగరేణి బొగ్గురవ్వలా
ప్రతీ గుండె భగ్గుమంది!

గరిబోళ్ళ పిల్లలేమో -
పసులకాడి పాలేర్లైరి!
తెలంగాణా రైతుబిడ్డలు -
పల్లెలిడిసి బతకవోయిరి!
పల్లెటూర్లో మిగిలినోళ్ళు -
పనుల్లేక పస్తులుండిరి!



తినవోతె తిండిలేదు!
తాగనీకి నీళ్లులేవు!
రోగాల రోజులొచ్చె
రైతుకూలి సగం సచ్చె!
అరె, డొక్కలెండిన గోజలన్నీ
కబేళాలకమ్ముతుండ్రి!

సదువుకొనే తాహతేది!
సదువుకున్న కీమతేది?
ఆస్తుళ్ళు బందువెట్టిరి
కన్నీళ్ళ విందువెట్టిరి!

ఫీజులేమో పెంచేసిరి
సదువులేమో బంజేసిరి



అరె, నౌకరీలు రాని సదువులు
బకరాల బతుకులాయె!

తెలంగాణా కతను ఇంటివా
తెలంగాణా ఎతను కంటివా
తెలంగాణా జీవితాలు
అలుగ్గుడ్డ సందమాయె!

తెలంగాణా ఆడబిడ్డలు
పంజాలిసిరి పులి బిడ్డలైరి!
అరె, తెలంగాణా పేరుకోసం
పోరుబాట పట్టినారు!

విద్యార్థులూ మేధావులు -
లాయర్లూ డాక్టర్లు -
ఉద్యోగులూ, కళాకారులు -
కార్మికులూ, కర్షకులు
తెలంగాణా సంఘాలన్నీ
పల్లెలల్ల... పట్నాలల్ల
మేఘాలై ఉరుముతుంటే -
సింహాలై తరుముతుంటే -
అరె సర్కారోడు ఏమి జేస్తడు?
తెలంగాణా ఇచ్చిపోతడు!



వి. శోభ,
ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ & హెచ్.ఆర్.ఎం, కాకతీయ యూనివర్సిటీ, వరంగల్

# నా పల్లె

- కురిమెండ్ల సృజన

సెల్: 8106537096



ఇప్పుడు నా పల్లె ఇడిసిన ముల్లె అయింది
అందం సందం లేక పొక్కిలైన వాకిల్లు
మరిపెం ముచ్చట్లు లేక బీరిపోయిన ఇండ్లు
పల్లెంత పర్సుకున్న సర్కారు తుమ్మ ముండ్లు
సూటిగ నా పల్లె గుండెల్ల దిగబడినయ్...

కట్ల పూలు గుమ్మడీ గునుగుపూలు
ఊరు కొసన కుంటల్ల కలువపూలు
ఊరౌతల బాయిల తియ్యనీల్లు
జాడలేవు వాడలల్ల కళే లేదు
కరువు సాలుబట్టిన బతుకులు సూడు...

తాటి చెట్లకు కల్లులేని లొట్లు
ఈదులల్ల ఊరని కల్లు బొట్లు
సింత సెట్లకు సిగురే పుట్టలేదు
మామిడి తోటల్ల పూత పూయలేదు
కోయిలా రాదు పాడదు...

గోదారి నీళ్ళు ఎటు మాయమాయె
గంగమ్మ పాయెలు ఎవరెత్తుకుపోయిరి
తెలంగాణా తల్లులూ సెల్లెల్లూ
నీటి ఊట కోసం కన్నీటి సెలిమలై
సెమటలు నిండిన సెరువులై
గాయిరి గాయిరి తిరుగుతుండిరి...





ఇదెవరి శాపం బిడ్డా
సెరలంటే సెరలు కాదు
ఇంకెంత కాలమే అవ్వా
తెగని ఈ కష్టాలు?
లడాయికి దిగుదమా?
లొల్లి లొల్లి సేద్దమా
మన రాజ్యం కోసం పంట కొడవల్లమై
జంగ్ బాట పడ్దమా?

కె. సృజని,
H.No. 3-14-450/2, దుర్గా కాలనీ, హన్మకొండ - 1

# నిన్ను నువ్వే మార్చుకో

- టి. లీల
సెల్: 99085 27267



ఓ తెలంగాణ మహిళా
నీ మతం ఏదైతేనేమి
నీవు కరీమున్నీసావయినా
కాత్యాయినివైనా
ఎంత భోళాదానివి
ముగ్గురు బిడ్డల్ని కని
దిక్కులేనిదాన్ని చేసి పారిపోతే
అక్షరాలు దిద్దుకొని - ఉద్యోగములో చేరి
పిల్లలతో ఒంటరిగా పోరాడిన
నిన్నెవరు చూసారు!
నీ మొగుడు ఎలాగూ రాడు అని అనుకోకు.
మధ్య మధ్యలో అవసరాలకూ
వసూళ్లకూ వస్తాడు -
పిల్లల్ని కన్న పాపానికి
నీవు పోషిస్తూనే ఉంటావు!

'ఎంతైనా ఆయన కదా' అంటావు!
పాతివ్రత్యం కదా -
ఈ పాతివ్రత్యం ఎంత భయంకరం -
ఎంత కాస్ట్లీ!
ఆడదాన్ని పీల్చేస్తుంది -
అయినా నీవు కండ్లు తెరవ్వు
తిరిగే ఉద్యోగానికి రోడ్డుప్రక్కన
ఎర్ర బస్సు కొరకు - ఎన్ని సంవత్సరాలు





ఎర్రని ఎండలో నిల్చున్నావ్!
ఎవరైనా జాలి పడ్డారా!
నీ భర్తకు కనువిప్పు కలగలేదన్న స్పృహనీకుందా?
ఎర్ర బస్సు కొరకు - ఎదిరి చూసినట్టే -
అతని రాక కొరకు - ఎదురు చూస్తున్నవు -
తిరిగి వస్తాడు -
కాని వంటరిగా రాడు!
నీ సవతి కన్నబిడ్డలతో వస్తాడు!
తల్లిని పోగొట్టుకున్న బిడ్డలు కదా -
నువ్వు ఆదరిస్తావ్!
ఎంత భోళాదానివీ!
ఓ తెలంగాణ మహిళా -
నీలాగా ఎంతోమంది!
ఇప్పటికైనా ఆలోచించు!
నిన్ను నువ్వు మార్చుకో!

టి. లీల, రిటైర్డ్ జాయింట్ డైరెక్టర్, విమెన్ & చైల్డ్ వెల్ఫేర్, ఏపి.
G.1, సాయి సూర్య అపార్ట్‌మెంట్స్, Plot No. 91, రాజీవ్‌నగర్, హైద్రాబాద్ - 500 045

# నేను నగేయాల్ల

- తుర్లపాటి లక్ష్మి
సెల్: 97042 25469



నన్ను గురుతువట్టలేదా ?
యాడికింత యేడుస్తనేవుంటి
కండ్లల్ల నీళ్ళు కార్తనే వుంటయి.
తుడిసినా ఫాయిదా లేదు.
నేను -
మీ తెలంగాణ తల్లిని
ఎంతమందిని
నా కడుపుల పుట్టిన పిల్లగాండ్లను -
గావురంగ పెంచుకున్నోళ్ళను -
నా సతంత్రం కోసం జరిగిన
ఉద్దెమంల
ఎంతమంది పోరగాండ్లను
పుజాలుగా పోగొట్టుకుంటి!
గానాడు
'మా కొలువులు మాగ్గావాలంటూ'
లొల్లి లేకుంట జరిగిన ముల్కీవుద్యమంల
గప్పుడే మీసమచ్చిన
సదువుకునేటోళ్ళను
పొట్టన వెట్టుకున్నరు!
'మా శవాలు మాగ్గావాలన్న' పాపానికి
ఇంక అయిసుపోరగాండ్లను
తుపాకి గుండ్లకు బలిదీసుకున్నరు!



గప్పట్ల
ప్రత్యేక తెలంగాణ ఉజ్యమంల
'మా సదువులు మేం జదుకుంటం -
మా కొలువులు మేం జేసుకుంటం
మా తొవ్వ మేం జూసుకుంటం' అంటే -
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డల్ని
మళ్ళా పొట్టన పెట్టుకున్నరు!
గిప్పుడు
ఉద్దెమం పెద్ద సముద్రంల
అంతట అలుముకున్నది
ఇయ్యాల
సిర్ఫ్ సదువులు, కొలువులేగాదు
'మా భూములు మాయే' నంటున్నరు.
'మా పడీతులన్ని మేమే జేసుకుంటం
మమ్మల్ని మేమే యేలుకుంటం
మా జాగలల్ల మావాడ్లే వుండాల'ంటున్నరు.



'అరే! తుడుమ్ఖాన్లా మీరు?
ఖబర్దార్! పక్కకు జరుగుండ్రి
మా ముల్లుగర్రలు మిమ్ముల్ని పొడవకముందే
కొడకా! మంచిగ ఎల్లిపొండ్రి
ఇగ గదువ వట్టుకునుడు లేదు.
బరిగెలందుకునుడె' అంటున్న
నా పిల్లల్ని జూసి
కండ్లల్ల నీళ్ళుతుడుసుకున్న
తమాయించుకున్న -

గిప్పుడు
మీ తెలంగాణ తల్లిని
యేడుస్తలేను -
మండుతున్న అగ్గిలెక్క కండ్లెర్రజేస్తున్న
కలుపులు తీసే నా చేతులల్ల
కొడవలున్నది - కనిపిస్తలేదా!
అరె ! ఈడికి ఆగేది గాదు.
నా ఇముక్తికి పోరాటం జేస్తున్న
నా బిడ్డలారా!
ఇగ ఆగకుండ్రి
ఎనుకకు మల్లకుండ్రి!
ఆల్లను పక్కకు నూకి
మీరే
గా కుర్సీలల్ల కూసోండ్రి
గప్పుడే - నేను
మీ తెలంగాణ తల్లిని
మీ కన్నతల్లిని
మీతోనే నగుత
నగుతనే వుంటా.

తుర్లపాటి లక్ష్మి
104, SVT అపార్ట్‌మెంట్స్, RTC colony, ముబారక్ నగర్, నిజామాబాద్ - 503 003



# నేను మనిషిని కానా?

- సస్య
సెల్ : 99482 80908



ఎందుకమ్మా ఇన్నిబాధలు
నాకెందుకమ్మా ఎన్నోగాధలు
ఆడపిల్లనని తెలియగానె కడుపులోనే చిదిమేస్తరు!
ఖర్మకాలి నేను పుడితె అవ్వా అయ్యా చిన్నపోతరు!
నేనేమిపాపం చేస్తినమ్మా నన్ను చూస్తే చీదరిస్తరు!
అవ్వ పిలుపులో కరుణ ఉండదు!
అయ్య చూపులో జాలి ఉండదు!
బుడి బుడి అడుగులతో బడికిపోతె -
చదువు చెప్పే గురువుగారు నాకు తెలియని మాటలడుగుతడు
మాయదారి మాయలోళ్లు కిడ్నాపు చేసి బూడిద చేస్తరు!
దారి వెంట నేను నడిస్తే దొంగ యెదవలు ఈలలేస్తరు!
కూలి కొలువు చెయ్యపోతె 'వంద ఇస్త - వస్తవా' అంటరు!
నూటికి నూరు మార్కులు వస్తే -
నువ్వెంత చదివినా దండగంటరు!
కాలేజీ చదువులు చదవపోతె -
ప్రేమ ప్రేమని యెంట పడతరు!
కాదు పొమ్మని 'ఛీ' కొడ్తే -
యాసిడ్ పోస్తరు - పీక కోస్తరు!
ఓణీలేసే వయసులోనే -
అత్తంటికి పంపిస్తరు!

మగని యింట కాలెడ్తే -

కట్నకానుకలు తెమ్మంటరు!

ఉన్నదంతా ఊడ్చిపోసినా -

'చాలదింకా - తే పొమ్'మంటరు!

బాంచనంటూ కాళ్ళు మొక్కినా -

గ్యాసు నూనెతో తగులపెడతరు...!

ఏమిపాపం చేస్తినమ్మా?

నేనేమి నేరం చేస్తినమ్మా?

ఆడపిల్లగా పుట్టడమే నా నేరమా? నాకిది ఓ శాపమా?



సస్య
W/o. M. Ramachary Qr.No. D 26, 24 area, ఇల్లెందు, ఖమ్మం - 507 124



# పల్లె తల్లి గుండె సప్పుడు

- హిమజ
సెల్ : 94414 92737



పిల్లగాండ్లు మీరు కండ్లల్ల కనపడ్తున్నరు
ఒక్కసారి మనదేశం రాంగ్రిరా కొడుకా
ఈడికస్తె ఆళ్ళకు ఆడున్న సౌలతులుండయి
సయిమాటే గని, పట్నంలనన్న వుండచ్చు మీరు
పదేండ్లకింద మీరచ్చినప్పటి లెక్క లేదు
మన పట్నమిప్పుడు

మన పల్లెకు రోడ్డు పడకపోతేంది
పట్నం రోడ్లమీద రోడ్లచ్చినయిప్పుడు
వూర్లె కరెంటు ఇస్తేంది ఇయ్యకుంటేంది
ఈడ రోడ్లనిండ లైట్లే యాలాడుతున్నయి

మనూర్లె మనింట్ల బాయిలన్ని ఎండుక బోయినయి
పట్నంలనైతే పోంటెన్లు ఒక్క తీర్గ సిమ్మిచ్చిపోస్తయి

అయినా వూర్లల్ల వుండనీకి
పట్నం సుట్టు మన పల్లెలు యాడున్నయిప్పుడు

ఫిలిమిసిటీలట రింగు రోడ్డులట
హైటెక్కులట ఏంటేంటియో గిరివి బెట్టి
మీ దేశం దిక్కునుంచె
మస్తు పైసల్దెచ్చిన్రట మిత్తికి
రాన్రాను గదేందో సింగపూర్లెక్క
జేస్తరట మన పట్నాన్ని

పైసవెడ్తె దునియ గనవడ్తుందిర కొడుకా
కడుపుల యత దించుకుందమంటె
సాయం బట్టెటోళ్ళు కనవడ్తలేరు -



నా జీవునమున్నంతల
ఒక్కసారి అచ్చిపోండ్రిరా
ఈడనే మన మూలాలున్నయి
ముచ్చట్లున్నయి
బోనాలున్నయి
బతుకమ్మలున్నయి

ఇప్పుడు పల్లెతల్లి
అన్ని దిక్కుల కొట్టుకుంటున్న గుండెకాయ
తల్లి పేగు మిమ్ముల తర్లిరమ్మని
తండ్లాడుతున్న తలపోత!
పిల్లలు కోడలు నువ్వు
పయిలంగుండుండ్రి బిడ్డా!

('తెలంగాణా సంబరాలు'లో చదివిన కవిత)

హిమజ,
305 - సౌందర్య రెసిడెన్సీ, వీధి నెం:8, హిమాయత్ నగర్, హైదరాబాద్ -29



# బతకమ్మ - బతకమ్మా కోల్!

- జి. శ్యామల
సెల్: 94901 89081



బతకమ్మా - బతకమ్మా ... కోల్
బంగారు బతకమ్మా ... కోల్
బంగారు బతకమ్మా ... కోల్
గౌరీ బతకమ్మా ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

తెలంగాణల పుట్టింది ... కోల్
తెలంగాణల పెరిగింది ... కోల్
ఊరూరు తిరిగింది ... కోల్
ఊళ్ళన్ని నాయంది ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

ఇల్లిల్లూ తిరిగింది ... కోల్
ఇంటింట్ల నిలిచింది ... కోల్
గడప గడప ఎక్కింది ... కోల్
గడపలన్ని దాటింది ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

బతకమ్మ ఆటంటే ... కోల్
ఆడోల్ల పండుగంటా ... కోల్
చిన్న బతకమ్మంటే ... కోల్
'చెల్లెలు - బొడ్డెమ్మా' ... కోల్
పెద్దబతకమ్మంటే ... కోల్
'అక్కా - బతకమ్మా' ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

బొడ్డెమ్మను సాగనంపి ... కోల్
పెత్రామాసనాడు ... కోల్
సంబరాలు సేయంగా ... కోల్
బతకమ్మ వస్తాదీ ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

కన్నెల్లు - పడుచుల్లూ ... కోల్
ముసలీ ముదితలూ ... కోల్
తొమ్మిది దినమ్ములూ ... కోల్
దినమొక్క పండుగనే ... కోల్
మురిసి పోయి ఆడేటీ ... కోల్
బతకమ్మ ఆటంటా ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

అడవంతా తిరిగి తిరిగీ ... కోల్
తంగేడు పూలు దెచ్చీ ... కోల్
చేను, చెల్కల్ దిరిగీ ... కోల్
గునుగు పుప్వా దెచ్చీ ... కోల్
గన్నేరు, దాసన్నా ... కోల్
తీరొక్క పూలు దెచ్చీ ... కోల్
బతకమ్మ సిగలోన ... కోల్
సింగారిత్తురంటా ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

గుమ్మాడి ఆకుల్లూ ... కోల్
బీరా ఆకుల్లూ ... కోల్
ముచ్చటైన సిబ్బిలోనా ... కోల్
బతకమ్మను పేరుస్తర్ ... కోల్
తీరుతీరు సద్దుల్లూ ... కోల్
తీరైన సత్తుల్లూ ... కోల్
బతకమ్మకు ఆరగింపూ ... కోల్
పిల్లా - పాపలకూ ... కోల్
బతకమ్మ దీవెనలడిగీ ... కోల్
తొమ్మిదో దినానా ... కోల్
సద్దుల బతకమ్మనూ ... కోల్
సల్లంగ సాగనంపుతం ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥



భూమిపై జనమంతా ... కోల్
బతికినన్నిరోజాలూ ... కోల్
సూర్యుడు, చంద్రుడూ ... కోల్
నిలిచినంత కాలమ్మూ ... కోల్
వర్ధిల్లు బతకమ్మా ... కోల్
గౌరీ బతకమ్మా ... కోల్! ॥బతకమ్మా - బతకమ్మా॥

ఏటేట బతకమ్మా ... కోల్
పండుగ జరిపేట్టీ ... కోల్
తెలంగాణా బిడ్డల్లూ ... కోల్
తెలంగాణా రావాలంటూ .. కోల్
రాబోయే బతకమ్మనూ ... కోల్
పాటల్లో - ఆటల్లో ... కోల్
కొలుచుకుందాం చెల్లెలారా ... కోల్
కోరుకుందాం అక్కలారా ... కోల్!



గరిశకుర్తి శ్యామల,
ప్రభుత్వ బాలికల కళాశాల ప్రక్కన, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా - 505 301

# బుక్కెడు బువ్వ - గుక్కెడు నీళ్ళ కోసం!

- తాయమ్మ కరుణ
సెల్: 99892 06397

తెలంగాణా రావాలి,
తెలంగాణ సెపరేట్ కావాలి -
ఏంది బిడ్డా అట్ల చూస్తున్నవ్
ఈ ముసిల్దేంది ఇట్లంటుంది అనుకుంటున్నవా?
దీనికేం తెలుసనుకుంటున్నవా?

బిడ్డా
గీ వూళ్ల పుట్టిన
గీ వూళ్ల పెరిగిన
గిక్కన్నే చస్తా...

బిడ్డా...
నా కళ్లముందల
బావుల్ల నీళ్లెండిపాయె
చెరువులు పూడిపాయె,
భూమి పక్కున పగిలె
గింజ రాలదాయె

బిడ్డా
నా కండ్లముందర
నా కడుపున పుట్టిన బిడ్డలు
సెట్టుకోడు పుట్టకోడు ఆయె
ఎవనింటికి పోతే
ఎవడు కూడు వెడ్తడు
ఆనికే లేదు నాకేంబెడ్తడు
ఇది కడుపాయె - అది ఆకలాయె



కల్లో గంజో తాగితి.
కని ఎంతకాలమిట్ల?

బిడ్డా
చదివించిన ఒక్కకొడుకు
నౌకరీలేక తిరిగి తిరిగి
ఇల్లిడిసి పాయె
ఆడు దొంగాయెనో లంగాయెనో
ఏది తెల్వకపాయె
సచ్చిన్నాడు తెలిసింది ఆడు నక్షలైటయ్యిండని,

బిడ్డా
సదూకున్నోనికి నౌకరీ లేకపోయె
సదూకోనోనికి నీళ్లు లేకపోయె
గందుకే బిడ్డ తెలంగాణా రావాలె!
నాకూ
నా బిడ్డలకు
బుక్కెడు బువ్వ దొరకాలె!



తాయమ్మ కరుణ,
Flat No. 410, విజయ రాఘవ రెసిడెన్సీ, విజయ బ్యాంక్ బ్యాక్ సైడ్, చందానగర్, హైదరాబాద్ -50

# మన తెలంగాణా

- నెల్లుట్ల రమాదేవి
సెల్: 94406 22781



వీర పుత్రుల సమరాంగణం
విద్యల తల్లి దివ్య ప్రాంగణం
మట్టి పాటల మాగాణం
మన బంగరు తెలంగాణం

ఎన్ని పోరాటాల్ని చూసిందో
ఎన్ని ఆరాటాల్ని మోసిందో
ఎన్ని కష్టాలను కాసిందో
చరిత్రకెక్కిన ఈ నేల ఎన్ని అసువుల్ని బాసిందో

రాణి రుద్రమ్మ కాకతీయ శౌర్య కీర్తి
సమ్మక్క సారమ్మ చూపిన సమర స్ఫూర్తి
మహిళలకెల్ల మార్గదర్శకమైనది -
ఐలమ్మ అద్వితీయ పోరాట దీప్తి

జాయప సేనాని పేరిణి సమర భేరి
సర్వాయి పాపన్న చూపిన పోరు దారి
కొమురం భీముని వింటి గురి
మరచిపోయేనా మన భూమి
విజయనగర రాజ్యప్రదాత
విద్యారణ్యుని జన్మసిరి

మందార మకరంద మాధుర్యాలతో
రాజులను త్రోసి రాజన్న కవిరాజు
భక్తికి భాష్యం చెప్పిన పోతన్న భాగవతం
గోదావరీ తీరాన గొంతెత్తి గోల్కొండ నవాబు
నెదిరించి గోపన్న వాగ్గేయకారుడై రామదాసై
చేసిన రామగానం



కోటిరత్నాల వీణయై భాసిల్లిన తెలంగాణలో
నైజాము నెదిరించి దాశరథి సోదరులు
సాధించిన జీవన యానం
కవితా విశ్వంభరతో
జ్ఞానపీఠాన్ని ఎక్కిన సినారె
జాతీయ గేయమై
అశోక తేజమైన సుద్దాల
జానపదుల గోస
శ్వాసైన గోరటి వెంకన్న
అట్టడుగు నుండి
ఉవ్వెత్తు కెరటమై లేచిన అందెశ్రీ
గేయ మాయాజాల మంత్రహాసమైన
చంద్రబోసు పాటల ఊయలలో
లాలన పొందింది తెలంగాణ



చుక్క సత్తయ్య ఒగ్గు కథల్లో ఓలలాడింది
సుద్దాల హనుమంతు పాటకు ఊగిపోయింది
నేరెళ్ళ ధ్వన్యనుకరణలో దరహసించింది
కాళోజి గొడవతో కదంతొక్కింది
పుణ్యచరితల పులకలెత్తిన మన తెలంగాణ
యుద్ధ నౌక గద్దర్ గానంతో గళం కలిపింది.

కాకతీయ గోల్కొండ భువనగిరి కోటలు
కఠిన చరిత్రకు సజీవ సాక్ష్యాలు
బురుజులు గడీలు దర్వాజాలు తోపులు
రాతి గోడలు మట్టి దారులు
కరిగి పోయిన కాలానికి సజీవ తార్కాణాలు

జొన్న కంకులు సజ్జ చేనులు
దొండ పాదులు దోస తీగలు
ఊర చెరువులు ఊట చెలమలు
కష్టాల కడగండ్ల కావిళ్ళు మోసిన
తెలంగాణ ముద్దు బిడ్డలు రైతులు



తంగేడు గోరింట గుమ్మడి రుద్రాక్ష
గునుగు గడ్డి బంతిపూల బతుకమ్మ
పడుచుల అడుగులకు పరవశించింది
పీరీల పండుగకు అస్సైదులా అంటూ
దసరాల రోజుల్లో జమ్మాకు పంచుతూ
అలాయ్ హలయ్ బిడ్డలను ఆశీర్వదించింది

కామదహనం చేసి వసంత వాకిళ్ళలో
చెమ్మకేళిల హోళి ఆటకు అడుగు కదిపింది
కరువు కాలాన కప్పల పెండ్లి చేసిన
చిన్నపిల్లల కొరకు చినుకులు రాల్చింది
తొక్కుడుబిళ్ళ ఓనగుంటలు
చిర్రాగోనె చార్ పత్తర్
తుడుము దొంగాటలకు వేదికయ్యింది

యాదగిరి నరసింహ భద్రగిరి రామన్న
బాసర చదువులమ్మ వేముల వాడ రాజన్న
అడుగడుగున గుడులున్న రమణీయ శిల్పాలున్న
వేయి స్థంభాల రామప్పరాగిణుల
ఆలంపురాల అద్భుత నేలమ్మ
అవసాన దశలో ఆక్రోశిస్తున్న
చిత్రమేమోనమ్మ



నాగార్జున శ్రీరామ సాగరాలైనా
కృష్ణాగోదావరి మూసీ మంజీరలున్నా
ఎండిన మండిన తడవని గొంతులు
నెర్రెల భూములు పండని పంటలు
తెలంగాణమంతా ఆవిరికలలు ఆకలి మంటలు
సిరిపురము సిద్దెంకి ఆర్మూరు గద్వాల గాజుల పోచంపల్లి
ఖండాంతరాలలో ఖ్యాతి తెచ్చాయి
సిల్కు చీరెలకు ఎన్నో సిరులనద్దాయి
నూలువస్త్రాలకు నవ్యవర్ణాలు దిద్దాయి
చేవగల జీవకళలెందుకో పాపం... నేడు
చేనేత కార్మికుల ఉసురు తీశాయి

గనులు తొలచి నల్ల బంగారు సిరులిచ్చి
చీకటి బ్రతుకులీడ్చు సింగరేణి కార్మికులు
అడవి బిడ్డలు ఆదివాసీ గోండులు
రాళ్లు మోస్తూ గుండె రాళ్ళయిన లంబాడీలు
కండలు కరిగినా కలలు మిగలని కష్టజీవులు
తెలంగాణ గతమంతా ఘనమైన చరిత
కాల ప్రవాహానికి ఎదురీదిన ఘనత
ప్రశ్నార్థకమైన వేదనా మయ భవిత
నేటి యువత ఎగరేయాలి మళ్లీ కీర్తి పతాక

నెల్లుట్ల రమాదేవి,
కస్టమర్ రిలేషన్స్ ఆఫీసర్, ఆంధ్రాబ్యాంక్ జోనల్ ఆఫీస్,
నక్కలగుట్ట, హన్మకొండ, వరంగల్ - 506 001

# మాకు తెలుసు...!

- అరుకొంతం ఇందిరాదేవి
సెల్: 94418 27842



మీరు చెప్పే అబద్ధాలు నమ్మేవాళ్ళం కాము మేము,
ఎందుకంటే -
అసలు 'నిజాలు' మాకు తెలుసు!

మీరు మాకు దారి చూపిస్తామంటారా ?
చాల్లే ఊరుకోండి,
మా 'గమ్యం' ఏమిటో మాకు తెలుసు!!

మా ఇంట్లో వుంటూ... మా వంటలు అసహ్యించుకుంటారు...
తిన్న యింటి వాసాలను లెక్కించే...
మీ 'తినమరిగినతనం' మాకు తెలుసు!

ఈ గడ్డమీద వుంటూ... మా బిడ్డలని చెప్పుకోరు మీరు....
బతుకు తెరువుకొచ్చి దోపిడీకి దిగజారిన
మీ 'దగాకోరుతనం' మాకు తెలుసు!

భాష ఒక్కటైనందున విడిపోవద్దని వ్యర్థవాదం చేస్తారు.
మా యాస చూసి హేళన చేసే...
మీ 'వెక్కిరింతలు' మాకు తెలుసు!

ఇప్పుడు -
'కలిసుందాం!' రమ్మంటారు... పాలూ నీళ్ళలా!
కానీ -
'చాపకింద నీరు'
ముంచటానికేనని మాకు తెలుసు!

ఇంతెందుకయ్యా!?
మా బతుకులు
మమ్మల్ని బతకనివ్వండి!
మీరంటే ఏమిటో
మాకు మహ బాగా తెలుసు



అరుకొంతం ఇందిరాదేవి, ఎం.ఏ., ఎ.మ్మెడ్., ఎల్.ఎల్.బి.
W/o. మల్లారెడ్డి, గాగిల్లాపూర్, వయా బెజ్జంకి, కరీంనగర్.



# మా జోలికొస్తే...

- మేరీ కుమారి మాదిగ
సెల్: 98481 48259



ఓ అవ్వల్లారా ఓ అయ్యల్లారా
జర నామాటను ఆలకిస్తరా
నేను ఎల్లవోసుకునే గోసను
పట్టించుకుంటర?
పట్నంల నా కొడుకు పెద్ద సదవులు
సదువుకుంటడని పంపిత్తి!
మీ పోరగాండ్లేమో మీ ఇండ్లల్ల కొచ్చిరి!
నాకున్న ఒక్కగానొక్క కొడుకు
నా గుడిసె జేరకపాయే!
కండ్లల్ల గుడ్డి దీపాలు ఎలిగించుకొని
ఇగ ఒస్తడు కొడుకు, అగ ఒస్తడు కొడుకు
అని ఎదురుసూత్తున్న!
ఇంటికొచ్చి పోయినప్పుడల్లా
వాంది ఒక్కటే సోదాయే!
"అవ్వా! తెలంగాణా జిల్లా పల్లె పల్లెల్ల
ప్రత్యేక రాష్ట్రం లొల్లి మొదలైంది.
ఎంతో మంది నాతోటి విద్యార్థి సోపతిగాండ్లు
గుంపులు గుంపులుగా వోతుండ్రు!
జిల్లకొక్కరు, పల్లెకొక్కరు కదిలి పోతుండ్రు!
నేను గాల్లందట్ల ముందు ఉండాలనుకుంటున్ననే"
అని కడసారి ఉత్తరం రాసిండు!
కండ్లల్ల కన్పించడాయె!
'అవ్వా' అని పలుకరించడాయె!
గుండె తరుక్కుపోతుంది,

కన్నపేగు కొట్టుకుంటున్నది
సిన్ననాడు నా ఎదురుంగ దిర్గుతుంటే
వాడు అ..ఆ..లు ఇ..ఈ..లు సదువుతూ
నన్ను సంబరవెడ్తుంటే
నా కన్న కొడుకు డాక్టర్ అయితడో
ఇంజనేరు అయితడో,
కలెక్టర్ అయితడోనని కలలు గన్న!
నా కల చెదిరిపోయె, కన్నీరే మిగిలిపోయె!
నా కంటి శోకం ఎవ్వరికి జెప్పుకోవాలె?
నా ఇంటి దీపం, ఎక్కడనని ఎతకాలె?
పొడిసే పొద్దుల్లున్నడ? బుద్ధిమంతుల్లున్నడ?
పల్లె సుద్దుల్లున్నడ? యుద్ధరంగంలున్నడ?
తెల్వదాయె!
ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం,
ఎందరో ప్రాణమిస్తుండ్రటా!
ఆత్మ బలిదానాలు చేసుకుంటున్రట!
ఆత్మాహుతులు జేసుకొని, అమరులైతున్రంట!
గండ్ల మావాడుగిన... ఏడన్న కన్పించిండా?
వాడు పుట్టంగనే సక్కగున్నడని, 'సూరి' అని పేరు పెట్టుకున్న!
వాడు నా ఇంటికి ఎలుగివ్వక పోయిన...
రేపు...
తెలంగాణ ప్రత్యేక రాజ్యంలో
కొత్త ఎలుగును విరజిమ్ముతడేమో?
అది నా కండ్లారా జూడనీకైనా
నేను బతికే ఉంటా!



మేరీ కుమారి మాదిగ,
12-13-878, హన్మాన్‌నగర్, Behind AP Diary, తార్నాక, సికింద్రాబాద్ - 500 017



# మాతృమూర్తికి నివాళి

- విజయ దామోదర స్వామి
సెల్ : 92474 69498



రామయ్య కొలువున్న రామగిరి కోట
మాతాత నెలవున్న ఊరు బేగంపేట
విలసిల్లె వారిల్లు ఆ వూరిలోకెల్ల
కొలువుదీరితివమ్మ కొదువలేని ఇంట
మాయమ్మ జగ్గమ్మ అందాల భరిణ

పైరు పంటలు కలవు పాడి ఆవులు కలవు
పట్టు పాలల్లోన పుట్ట తేనెలు కలిపి
సేవించి పవళించె పట్టె మంచం మీద
మాయమ్మ జగ్గమ్మ బంగారు తల్లి

బతుకమ్మ పాటలూ కోలాటమాటలు
చెమ్మచెక్కాలాట పచ్చీసు ఆటలు
అమ్మలక్కల తోడ అష్ట చెమ్మాలాడె
చిన్న పెద్దల తోడ కలిసి పోయుండేది
మాయమ్మ జగ్గమ్మ అనురాగవల్లి

కళ్యాణ మాడించి పంపించె నీ తండ్రి
ఏమిచ్చి పంపెనో ఏ దిక్కు చూపెనో
పుట్టితివి ఆ యింట మెట్టితివి ఈ ఇంట
ఏడేళ్ళ యీడులో ముత్తైదువైనావు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ



అడుగు బెట్టితివమ్మ అత్తవారింటిలో
కొత్త కోడలివయ్యి కోటి ఆశల తోడ
గతిలేని సుతిలేని చుక్కానియే లేని
పడిపడి లేచేటి ఆ బతుకు పడవలో
మాయమ్మ జగ్గమ్మ కష్టాలు దరిజేరె

మక్క జొన్నలు దంచి అడ్డెడన్నము వండి
అత్తమామల బెట్టి పరివారముకు బెట్టి
నాయిన్నచ్చే దాక ఎదురు చూపులు చూసి
తినే దాక వడ్డించి మిగిలింది తింటివి
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

బడుగు బుడుతలమైన మా బాగు కోసం
బతుకు బాటలోన నాయిన్నతో పాటు
నడుము కట్టి నీవు కదము తొక్కినావు
కరువు కాలంలోన కష్టించినావమ్మ
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

కురిసేటి గుడిశెలో తడిసేటి నేలలో
పడక మంచము లేక పరువ దుప్పటి లేక
అరికట్లములు గట్టి చలి మంటలను బెట్టి
నడిరాత్రి దాటినా నిద్ర పోనేలేదు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ



చేనేతబట్టల్ని రంగుల్లో ముంచి
చేతి కుట్టుతోటి చిట్టి గౌనులుకుట్టి
అందాల రవికెల్ని - అందంగాకుట్టి
చిల్లి పైసలకొరకు - ఇరుగుపొరుగులకమ్మి
కూడబెట్టితివమ్మ - నీదూ బిడ్డలకొరకు

నాయిన్న జీతాలు సరిపోక ఆనాడు
ఘుమ ఘుమ అప్పాల దుకాణమును పెట్టి
పుట్నాల లడ్డూలు - పేలాల ముద్దలు
కారప్పూసలు చుట్టి - అరిసెలను జేసి
రాళ్ళ పొయ్యిల మీద వండి అమ్మితివమ్మ

కష్టాలు కన్నీళ్ళ పంటి బిగువున పట్టి
కొంగు నడుముకు చుట్టి వడ్లన్ని దంచేసి
చెమట చుక్కలతోటి - కష్టాన్ని నెట్టేసి
భక్తి పాటలు పాడి హాయిగా నిద్రించె
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఎట్ల జేస్తిరో మీరు అక్కల పెళ్ళిండ్లు
ఎట్ల జేస్తిరో మీరు అల్లుండ్ల మర్యాద
మంచి  మాటలతోటి మనసు నొప్పించక
మా మంచి బావల మరపింప జేసి
నిబ్బరంతో మీరు నిలుపుకొంటిరి పరువు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఇసిరి వండిన గడుక ముద్దలను బెట్టి
నిప్పులో కాల్చిన ఆకుటప్పాలతో



పెట్టినావు నీవు పొట్ట నిండా మాకు
మాకు పెట్టిందెంతో నీకు మిగిలిందెంత
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

పాలు పెరుగన్నాలు పెట్టలేదని నాడు
ఏడ్చినావు నీవు ఎక్కి ఎక్కి
గుడిశె కాడుండంగా నన్ను బట్టుకొని
గుర్తుందిలేయమ్మ గుర్తుంది నాకు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

మా అక్క చెల్లెండ్ల మా అన్నదమ్ముల
గట్టి కండల శక్తి గుండె నిబ్బర శక్తి
వచ్చెనే నీ గడుక ముద్దతోనే
వచ్చెనె నీ బాట మాటతోనే
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

మారేటి నాయిన్న బదిలీల బాధ
ఏ వూరికావూరు కొత్త కొత్త
పండు పంటలు లేవు మంచి పంటలు లేవు
పట్టెడన్నంలేని పంతులమ్మవు నీవు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఏ వేళకేమౌనో ఎవ్వరెట్లుందురె
ఎవ్వరేమందురో ఎట్లుందురోయని
ఎట్లరా దేవుడని విలపించినావమ్మ
గుబులుతో నీ గుండె దిగులుతో నిండె
మాయమ్మ గుండెంతా కన్నీటి చెరువాయె



సత్తెక్క, సుశక్క, లచ్చక్క, వినోదక్క
రక్త బంధంలోని అనురాగమె తెలిపి
అన్నదమ్ముల లోన అనుబంధమే పెంచి
తల్లి ప్రేమను వారు తలపింపజేతురు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

మణెక్క లేదాయె మరచిపోలేమాయె
నీ  కొమ్మ రెమ్మల్లో ఒకటి విరిగినదమ్మ
రమ, మంగ రూపాల్లో చూసేము మేమంతా
దరిజేర్చుకొంటాము వారి పరివారాన్ని
మాయమ్మ జగ్గమ్మ చింతించవలదమ్మ

ఇంత మందివి నీవు కనిపెంచు వేళలో
ఒక్కరైననుగాని కాలేదు దుష్టులుగ
మేలు చేయును గాని కీడు తలపే లేదు
మా జన్మ ధన్యంబు నీ పెంపకంలోన
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఉట్టి గుండెలతోటి ఒంటి ఊపిరితోటి
వేడి తగిలిన గాని గాలి సోకిన గాని
విల విలలాడేటి బలహీన జీవులకు
నీ గుండె నిబ్బరం వారికాదర్శాలు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఆ తరం వారికి ఈ తరం వారికి
తరతరములోని పరివారమంతకూ
నిరతరం సేవించి అలిసినావమ్మ
ఓయమ్మ నీదెంత దయగల్ల గుండెనె
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ



తెలుగు నేల నుండి దేశాలు దాటేసి
అమెరికా ఖండాన గోపన్న గుండెలో
చేరుకొంటివి నీవు తీరాలు దాటి
గోపన్న చేయునే నీ కొరకు పూజలు
ధన్యమయ్యిరి వారు అమెరికా జీవులు

చూడ చక్కని వారు నీ ముద్దు కోడండ్లు
మీకు కోడండ్లేమొ మాకు వదినమ్మలు
సేవలందించిరి నీ సేవ పొందిరి
నీదు భాగ్యంబేమొ వారి పుణ్యంబేమొ
పంచుకొనిరివారు మా రక్త బంధాన్ని
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

అమ్మమ్మ అంటున్న మనుమరాళ్ళను గూడి
పరిహాసములాడి పక పక నవ్వించి
పరిచావు నీ గుండె పట్టు పానుపు వోలె
ఓయమ్మ నీదెంత రస రమ్య బంధమె
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

మనుమల్లో నీ తండ్రి మోమునే గాంచి
నాయినా అన్నావు చంటి పిల్లల పిలిచి



ముని మనవల జూసి మురిసి, మురిసి నవ్వి
పంచినావు నీవు ప్రేమతో పైసలు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఏడేడు లోకాల తీరాలు దాటేసి
పరమాత్మ చెంతలో మోక్షాన్ని పొందేరు
కడుపు తీపి మీరు మరచిపోలేరమ్మ
మా కొరకు వేసారు ముక్తి మార్గాలు
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

కొడుకు కోడండ్లతో, కోరుకున్నట్లుగా
వేరు కాపురంతోటి కల్సి వుండేటట్లు
ఏర్పాటు చేయించి నువ్వేరు పడితివి
మీదు భారము మేమ్మోయకుండా
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ

ఎనభై ఏళ్ళనాటి వెనుబాము వంగింది
కనుపాప కరువైన కన్నులే మిగిలాయి
కరిగిన కండల్లో సత్తువే లేదాయె
వణికేటి పాదాల నడక కష్టంబాయె
మాయమ్మ నీగోస చూడలేకుంటిమి

మాతృదేవోభవ పితృదేవోభవ
అనుకొనుచు మేమంత దండాలుపెట్టేము
ఓయమ్మ నాయిన్న ఆశీర్వదించండి
నీ చరిత లోకాన వినుపింతు మేమంత
మాయమ్మ జగ్గమ్మ వందనాలమ్మ


కీ.శే. జగ్గమ్మ

(మూర్తీభవించిన మాతృత్వం, మట్టిలో మాణిక్యం మా అమ్మ జగ్గమ్మ. కష్టాలనూ, కన్నీళ్ళనూ చెమట చుక్కల్లోకి నెట్టి నిలబడిన ధీశాలి! కనడం కన్నా పెంచడమే ముఖ్యం అని నిరూపించిన ఆదర్శ మహిళ! మంచి కుటుంబం, 'మంచి వ్యవస్థ'ను తయారు చేస్తుందంటూ - అందరికీ స్ఫూర్తి కలిగించిన మా అమ్మకూ, మా అమ్మలాంటి మాతృమూర్తులందరికీ ఈ పాట అంకితం - **విజయ దామోదర స్వామి**)

విజయ దామోదర స్వామి
H.No. 4-40/2, ఎల్లమ్మతోట, మేడ్చల్, R.R. District - 501 401



# రెండు గుర్రాల స్వారీ

- జ్యోత్స్న
సెల్: 98660 49478

వద్దు - వద్దు - వద్దు పడిపోతాం - పతనమవుతాం
ఎక్కడి వారైనా - ఏ వాడ నుండైనా,
ఏనాడొచ్చినా -
బతకటానికొచ్చి - బ్రతికే భాయి
ఈ మట్టి తల్లి రుణం తీర్చుకో -
ఇజ్జత్ కాపాడుకో
సీమ నుండో - కోస్తా నుండో,
మరాఠీ వాడివో - మార్వాడీ వాడివో,
ఆదరించిన ఈ తల్లే.. నీకు ఆధారం అయింది!
బేమాన్ కాకుండా అమ్మ గౌరవం సవాలు చేయి!
ఆత్మాభిమానం అమ్ముకోలేని పోతన వారసులం
మా కడుపులు మాడ్చుకొని, బిర్యానీలు మీకు పెట్టాం
విద్య, వైద్య, పరిశ్రమల కోటాలన్నీ దోచుకోనిచ్చాం.
చదువురాని బేవకూఫ్‌లంటూ ప్రగతిలో
స్టాగ్నెట్ అయ్యాం
యాభై ఏళ్లుగా 'యాడవేసిన గొంగళి ఆడనే' అన్నట్లుగా ఉన్నాం.
చెరుకు రసం పీల్చిన పిప్పిగా మిగిలాం -
వార్నింగ్!
రెండు గుర్రాల స్వారీ - దొరకదే దారి?
పడిపోతారు - పతనమవుతారు, వద్దు వదలండి!



జ్యోత్స్న
G.1, సాయి సూర్య అపార్ట్‌మెంట్స్, Plot No. 91, రాజీవ్‌నగర్, హైద్రాబాద్ - 500 045



# లెంక పీట

- నాంపల్లి సుజాత
సెల్: 98480 59893



తెలంగాణ తల్లి
నేడు కన్నీరు మున్నీరు
పంచన చేరి వంచించినందుకు
చెంగు చెంగున ల్యాగ దూడను
లెంకపీటతో లొంగదీసినట్టు
ప్రాజెక్టులన్నీ పక్కదార్లు పట్టించి
పారే నీళ్లకు మోకాలడ్డినా
మా గడ్డపై మేమే అస్తిత్వాన్ని పోగొట్టుకున్నా
మా భాషను ఎండగట్టి
గుణహీణులకు, గుండాలకు అంటగడుతున్నా
మా నెత్తురు
సలసల మసలక మరేమౌతది?
మా ఇంట్లోనే మేం పరాయోల్లమా?
మా నౌకర్ల కెసర్లుబెట్టిన
కాట్లె కుక్కలెవరు?
మా మూతుల కుట్లుగట్టి
రెక్కల కష్టాన్ని మెక్కుతున్నదెవరు?

గడ్డకు పడ్డ చాపలోలె
గలగిల్లాడుతున్నం
కాకులు గద్దలోలె కలె తిరుగుతంద్రు
కోడిపిల్లలమనుకునేరు
కోడె నాగులం.

మా బువ్వ
మాగ్గానియ్యకుంటే
చెట్టుకొకలం పుట్టకొకలం
సక్కటి సమాధానం
గల్మ దాటిచ్చుడే
పక్షపాతపు పాచికలకు
నూకలు చెల్లినట్లే
తల్లీ తెలంగాణా!
రానున్నయి నీకు రతనాల రోజులు



నాంపల్లి సుజాత,
H.No. 3-13-105/2, Srinivasapuram, Ramanthapur, Hyderabad - 13



# శల్య రాజకీయాల్ని నమ్మే ఎర్రి బాగులోల్లం కాదు..

- కందాల శోభారాణి
సెల్: 9392411256



ఆనాటి
నిజాం నిరంకుశ పరిపాలనకు
జమీందారీ జాగిర్దారీ వ్యవస్థకు
తెలంగాణ విమోచనోద్యమం స్మృతిపథం
అపారమైన ఖనిజ సంపదకు
నిలయం తెలంగాణ
కృష్ణ గోదావరి నదులు
తెలంగాణకు కుడి ఎడమలు
హైదరాబాదు తెలంగాణ గుండె
పొత్తుపథకాల జిత్తులకు
మన తెలంగాణ వనరులు, ఆశలు తెర్లయి
బతుకులు ఆగమయి
పంట భూములకు సాగునీరు లేక
అరకొర పంటతో బుగ్గైన
తెలంగాణ పల్లె
కంటినీరు తుడవని జలయజ్ఞం పేరుతో
తేరుకోలేక తెల్లబోయి
నీళ్ళు గమ్మిన కళ్ళలోనే తడుపుతున్న
మా రక్తం మరిగిన ఆవేదనల్ని చూస్తున్న
ఇంకా సమైక్యాంధ్ర శల్య రాజకీయాల్ని నమ్మే
ఎర్రి బాగులోల్లం కాదు
ఈ బీడుల్లో పచ్చదనం మొలవనపుడు -
మా నదుల నీళ్ళన్నీ పరవళ్ళు తొక్కనపుడు -
కోట్ల కత్తుల్ని పదునుపెట్టే నెత్తుటి సాన -
కోటి రత్నాల వీణ మా తెలంగాణ!



కందాల శోభారాణి
తెలుగు అధ్యాపకురాలు, ఎల్.బి. కళాశాల, వరంగల్.

# శోకించకు !

- అరుణశ్రీ
సెల్: 99496 99686



నాడు...
ఏ రిజర్వేషన్‌తో అరుంధతీ దేవి
గగన హర్మ్యాల్లో విహరిస్తూ
దివి నుండి భువికి
వెలుగు స్వరాల దివ్య హారతులు
తరతరాలుగా అందిస్తోంది?

మహాత్ములకు మహాత్ముడైన అంబేద్కర్
ఏ రిజర్వేషన్‌తో నారీ లోకానికి
హక్కుల విప్లవ శంఖం పూరించి
చరిత్రలో చిరకాలం వర్ధిల్లే సృష్టికర్త అయ్యాడు?

శతాబ్దం గడిచిన దశ దిశలో సామాన్య గృహిణికి
శక్తి యుక్తి సామర్థ్యం కన్నా సాధన కృషి ముఖ్యమన్న
సందేశంతో గుడిసెల్లో దివ్వెల కాంతులు వెలిగించిన
సావిత్రి పూలేకి ఆనాడు ఏ రిజర్వేషన్లు ఉన్నాయి?

నేడు...
రిజర్వేషన్లుండీ...
ఈ అరవై రెండేళ్ళ స్వతంత్ర భారతావనిలో
మరో అరుంధతినీ
ఇంకో అంబేద్కర్‌నీ
పోనీ ఓ సావిత్రి పూలేని
చూడగలిగామా?
నో!
మరెందుకీ ప్రతిభని
నిర్వీర్యం చేసే రిజర్వేషన్స్?
భారతీ -
ప్రశ్నించు - శోకించకు!



అరుణశ్రీ, ఎం.టెక్.
Flat No. 602, ప్రతిభా అపార్ట్‌మెంట్స్, Opp: St. Patricks High School, Secunderabad - 500 003



# సమరాంగన

- చాడా లలితాదేవి
సెల్ : 98488 68071



ఓరుగల్లు భద్రకాళి, రుద్రాంబిక, ఝాన్సీరాణి
అంశమ్మున తెలంగాణా మహిళలుద్యమిస్తున్నారు.
జీవితాల్లోనే కాదు,
పోరాటాల్లో భాగస్వాములవుతున్నారు
అంగణమైనా, సంగరమైనా ముందుంటామంటున్నారు
చేసే వృత్తులను వదలి....
ఉద్యమాలనే ప్రవృత్తులుగా చేసుకొంటున్నారు
కులమతాలకు, అంతస్థులకతీతంగా కదలుతున్నారు
ఉద్యమాలకు బాసటగా నిలుస్తున్నారు
ఉద్యమించేవారికి ఊపిరి పోస్తున్నారు

'పదవులు తృణప్రాయాల'ంటూ - వదలిన మహిళలను చూసి
గద్దెలను పట్టుకొని వ్రేలాడే గద్దలకు,
నోట మాటరాక, చేష్టలుడిగి పోతున్నాయి.
తమ నరాలనే నారులుగా చేసుకొని
నారీలోకం చేస్తున్న ధనుష్టంకారానికి
ఉద్యమాలను నీరుగార్చాలనుకుంటున్న వారే
నీరుగారిపోతున్నారు -
వనితల గాజుల గలగలలో వారికి
యమ వాహన ఘంటికలు విన్పిస్తున్నాయి

పాడుతున్న పాటలు -
అనైతిక రాజకీయతను వేలెత్తి ప్రశ్నిస్తున్నాయ్

బతుకమ్మ ఆటలు
పూటకోమాట మార్చే వారి పాలిట ఎ.కె.47లు

మహిళలు చేసే బృంద నృత్యాలు
బల్లిలా పదవిని కరుచుకొని పోయిన వారి

గుండెపై ఆడే ప్రళయపదనర్తనలు!

తరుణులు తలపైకెత్తుకున్న బోనాలవేడి
'పదవులకాగు'లలో పదిలంగా కూర్చున్న
నేతలకు తగిలి సెగలతో వేగిపోతున్నారు!



అవిశ్రాంతంగా సాగుతున్న ఈ రాజీలేని పోరాటాలు
రాజీనామా చేసి ఉద్యమించని నాయకుల,
బ్రతుకు యావకు దినదినగండాలు!

పిడికిలి బిగించి ఎత్తిన మహిళల చేతులకు,
కమ్మగా వండిపెట్టడమేకాదు -
చరిత్రహీనులను దండించడం కూడా తెలుసు!

మహిళలు ఆగ్రహించితే, వ్యాఘ్రరూపులవుతారనీ,
మనుగడకే చిరునామా గల్లంతవుతుందనీ,
తెలిసేదెప్పుడో? తెలివి వచ్చేదెప్పుడో?

ఈ చైతన్యం ......
దగాపడిన ఎదల్లోతుల్లోంచి వచ్చింది!
'ఛీ' - కొట్టబడిన గుండె పొరలను చీల్చుకొని వచ్చింది

ఈ గర్జనలు ......
అణచివేతకు గురైన అంతరంగ ప్రకంపనలు.
తమ బిడ్డల భవిష్యత్తుకు కలలు కనే,
తల్లుల ఆశలకు నిలువెత్తు సాక్ష్యాలు!

ఈ మహిళోద్యమ వెలుగులు
స్వరాష్ట్ర స్థాపనకు ముందుగా వెల్గించిన దీపతోరణాలు
ఆరిపోయిన తెలంగాణా బిడ్డల ఆత్మ జ్యోతులు
అఖండంగా వెలిగే అమరదీపాలు!

చాడా లలితాదేవి, ఎం.ఏ., బి.ఒ.ఎల్ (రిటైర్డ్ తెలుగు లెక్చరర్)
H.No. 5-4-32, క్లబ్‌రోడ్, కామారెడ్డి, నిజామాబాద్ - 503 111



# సావకు బిడ్డా....

- శారదా హన్మాండ్లు
సెల్: 9912275801



సదువుకొన పట్నంలున్నడు బిడ్డ
ఎయిల బిడ్డలంత పోరాటం చేస్తుండ్రు
లారీలకు ఈపులిచ్చి
కాలే కడుపులతో
అగ్గోలె రగిలి పోతుండ్రు

తెలంగాణ ఇగొస్తది అగొస్తదని
నాటి నుంచి చూస్తున్న
మా జాగ మాకెప్పుడైతదొ
బిడ్డ ఇంటికెప్పుడొస్తడొ

రగులుతున్న గుండె లెక్క
పసిడి పండె భూతల్లి
నెర్రెలిచ్చింది

కంటి దారోలె పారవట్టె
మంజీర పాయలన్ని
బతుకు పల్లేరు కాయైంది
మా కూడు తిని
బలిసిన అహం
మా భాషను యాసనవట్టె

యజమాని నేను
పాలేరు నువ్వనవట్టే

పొరుగోల్లు ఇంటె
నవ్విపోతరు

మేం చూసెటోళ్ళం
మీరు తీసెటోళ్ళు

మేం తినేటోళ్ళం
మీరు పెట్టేటోళ్ళు

యాడ మీదేనంత్రి
కుసున బోతె
కుర్సి గుంజేసిరి
ఇదేమి సోద్యమో

మా బతుకు మీద
మాకు సోయి లేదా

తన్నుకు పోయిన
మానోటి ముద్ద
మీ పెత్తనానికి పిండమైతది!

మర్లించుకన్న మా నీళ్ళే
మిమ్మల్ని ముంచి
కసి తీర్సుకుంటయి!

మా పిల్లలె పిడుగులై
కొమురం భీంలై
తెలంగాణ తెస్తరు!
మా పల్లె తల్లుల కొంగున ఎల్లు
నింపుతరు!

సావకు బిడ్డా -
మన జాగా మనదే!
మన రాష్ట్రం మనదే!



శారదా హన్మాండ్లు
H.No. 3-10-305/3, వివేకానంద నగర్ కాలనీ, నలందా స్కూల్ ప్రక్కన, న్యాలకల్ రోడ్, నిజామాబాద్ - 503 003



# హిమ్మతి తోని...

- సంగీత రాణి
సెల్: 98661 66660



మసీద్ కాడి యాపచెట్టు కింద
దినాం మీటింగులు మాకు!

సుంకరి రాములు - సుతారి బూమన్న
కుర్మె బోజన్న - సాకలి రాజన్న
కోమటి సాంబన్న - అవుసుల ఎంకన్న
మంగలి మల్లయ్య - మేర నర్సయ్య
డాక్టర్ మల్లరెడ్డి - టీచర్ రాంరెడ్డి
దూదేకుల వుస్సేను - చాయ్ వోటల్ మన్సన్
ఒక్కల్లేంది, అందరికందరం...
మీటింగ్‌ల కూసుంటం!
మీటింగ్ అంటే మీటింగ్ గాదు -
తెలంగాన మీటింగ్!
అవుమల్ల! 'జై తెలంగాన' అంటు - ఎన్నడైతె షురైందో -
అగ్గో - నాటి సంది దినామ్ మీటింగే!

సాకలి ఈరి బట్టల ముల్లెతోని అటెన్కచ్చింది -
"ఏం మీటింగు - ఏడిదాకచ్చింది?
అన్ని అట్టిమాటల్ - మనం బకరాగాల్ల మైతున్నం!
ఇగ సాలు గాని... తిందురా!" - రాజన్నను పిల్సుక పోయింది.

"రేపు 'ధూంధాం' - ఇంటింటికి పోయి షెప్పిరావాల"
సుంకరి రాములు లేసి - సక్కగ పోయిండు!

"ముత్తెంరెడ్డి పటేల్ - కిందికి మీదికి చేత్తుండు!"
పాలేరొచ్చి సెప్పంగనె...

డాక్టర్ మల్లరెడ్డి బండేస్కొని పోయిండు యెన్కనే!

"కరెంటు పుల్లచ్చింది - మోటర్ చాల్ జెయ్యాల -
లేకుంటే గింతే సంగతి!"

ఒకొక్కల్లె లేసి పోవట్టిన్రు!

" 'ధూంధాం'ల అందర్ని ఎడుకేట్ చెయ్యాల"
టీచర్ రాంరెడ్డి అన్నాడు... కూసున్నోడు లేసుకుంట!

నేను ఇంటిదారి వట్టిన - నడ్సుకుంటత్తున్న!

"కూరండలేదాయె - గీ కారం బువ్వవెడ్తున్నవ్" -
నర్సయ్య కోపంకత్తున్నడు.
"అంగట్ల అగ్గివుచ్చుకుంటున్నయ్ కూరగాయలు!
గీ కారమన్న వున్నది తిను, లొల్లి వెట్టక్" -
లచ్చి సమ్జాయిత్తున్నది.

బజాట్ల కినత్తున్నయ్ అల్ల మాటలు!

పైన ఎన్నెల సల్లగున్నది... గానీ,
నా గుండెల మంట మండుతున్నది!




రోడ్ మీద పోరగాల్లు ఆడుకోవట్టిన్రు!
తాటి కాయిల బండి తింపుకుంట -
'జై తెలంగాన!' - అంటుండు ఓ పోరడు!
'జైజై తెలంగాన!' అనవట్టిన్రు పక్కపొంటి పోరగాల్లు !

నా గుండెమంట సల్ల వడ్డట్టైంది!



దూరంగ... పంచాయితి కాడ ఒక్కటే బోరు నడంగ -
ఆడ్నే జమైన్రు ఆడోల్లందరు బిందెలు వట్టుకోని!
గింత రాతిరికి నీల్ల కొరకు తిప్పలు!

నా గుండె మల్ల మంటమండుతున్నది!

గడి ముంగటి కెల్లి రాంగ...
గైన్లముసలవ్వ -
"యాడి కోయినవ్ బిడ్డా? మీటింగ్‌ల కెల్లత్తున్నావా?
అయితాయెగానీ... 'తెలంగాన' అస్తదంటవా?"



ముసలవ్వ మాటలకి
నా గుండె మంట... సల్ల వడ్డట్టైంది!

పోరగాడికెల్లి - ముసలవ్వదన్క
తెలంగానంటె - తెల్సిపోయినంక...
తెలంగాన రాకుండ యాడికిపోతది?

"ఆయీ, తెలంగాన...
ఇయ్యాల్ల గాకుంటె - రేపైన తప్పకుంట అస్తది!" -
హిమ్మతి తోని అన్న లగాయించి!

W/o. ఐ. ఎల్లారెడ్డి, ముబారక్ నగర్, నిజామాబాద్ - 503 224

# క్షుద్ర దేవత

- చల్లపల్లి స్వరూపరాణి
సెల్: 94403 62433



నైజాం కండకావరంలో
శాపగ్రస్థ శరీరాన్ని
పంటి బిగువున ఈదుకొచ్చిన
వెట్టిచేప ఈ ఆడపాప...
తరాలనుంచే
గంపెడు చీకటిని
నెత్తిన పెట్టుకొని మోస్తున్న
ఈ 'శని దేవత'
తెలంగాణా పల్లెకు మాత్రం
ఓ క్షుద్ర దేవత...
దొరసాని బిడ్డకు పాలు తాపిన అమ్మతనానికి
దొర దాహార్తిని సేదదీర్చిన ఆడతనానికి
ప్రతిఫలం వూకుమ్మడితనం...
కొలువుల్లో చిందేసి
తలపొగరు భూస్వామ్యపు సిడిమానుకు
తలకిందులుగా వేలాడి
నెర్రెలిచ్చిన బీడులపై
నెత్తుటి కళ్ళాపి చల్లినందుకు
మిగిలింది పుండుబడ్డ దేహం..
ఈ జీవగడ్డపై ఎగిసిపడే
పోరు పతాకలు
కడగండ్ల వాకిట్లో కునారిల్లుతున్న
ఈ గాయంపై
నాలుగు తుంపర్లనైనా చిలకరించవు...
ఇక్కడ
ఏ మనిషి ఎందుకు చచ్చినా
ఏ పశువు ఎందుకు ఈసుపోయినా



అంతిమ సంస్కారం జరిగేది
ఈ పూరెలపటి జీవచ్ఛవానికే!
నగ్న వూరేగింపులూ...
నడివీధిలో అత్యాచారాలు...
సజీవ దహనాలు...
నెత్తురోడుతున్న
మాదిగ గూడేలు
ఎడతెగని దు:ఖపుటేరులు...
వూరు పచ్చగా రెపరెపలాడితే
అదంతా అయినింటి పుణ్యస్త్రీ పూజాఫలం
రోగం రొష్టుల పాలైతే మాత్రం
మాదిగ జోగురాలి బాణామతి పుణ్యం
ఇక్కడ మంత్రాలకు చింతకాయలు రాలవు గానీ
'మంత్రగత్తె'లకు మాత్రం పళ్ళు రాలతాయి...
అంధ విశ్వాసాలతో కుళ్ళి కంపుకొడుతున్న
ఈ రాచపుండు వ్యవస్థని
కడతేర్చి కాటికంపి
కొత్త లోకానికి పురుడు పోయాలని
ఈనాటి అరుంధతి
సరికొత్త చిల్లంగి నూరుతుంది.



చెల్లపల్లి స్వరూపరాణి,
4A, అనుమోలు ఎన్క్లేవ్, కంచుకోటవారి వీధి, రామచంద్రా నగర్, విజయవాడ - 8

# 144 సెక్షన్

- కొల్లాపురం విమల

సెల్: 98480 98333



పచ్చికలోని
గరిక పువ్వులు
ఖాకీల బూట్లకు నలుగుతున్నై

అయినా -
ఎర్రెర్రగ నగుతూ
పలకరిస్తూనే వున్నై వందలు వేలుగా
నిబ్బరం వుంటే
ఒక్కసారి తాకు మృదువుగా,
ముచ్చటిస్తాయవి
నీతో
'వెలిగేటి
దీపాలు
మెదులుతున్నై'



(పెసోవా స్ఫూర్తితో)

కె.విమల, ఎం.ఏ., ఎం.ఫిల్.
21A, HIG, Phase-3, New Santoshnagar colony, Hyderabad - 500 056.

# ఎపిలాగ్

- జ్వలిత




## కవయిత్రుల పరిచయం :

'అణకువగల అమ్మాయి' కవితలో సుజని 'అనువుగాని చోట అణకువ చూపిస్తే / అందరికీ చులకనే / ఆత్మాభిమానంతో, ఆత్మ స్థైర్యంతో అడుగువేయి' అని ఆహ్వానించారు, అది ఉద్యమం కానీ సమాజం కానీ ఆత్మగౌరవం ముఖ్యం అని చెప్పారు.

'అభివృద్ధి మయసభలో తెలంగాణ' కవితలో సెజ్జుల వేషధారణలో రియలెస్టేట్ వ్యాపారాలు, సాఫ్ట్‌వేర్ బూమ్‌ల పద్మ వ్యూహాలు/బడామాల్ బాగోతాలు' అంటూ వలసవాదుల వ్యాపారాల ముసుగులో తెలంగాణ దోపిడి గురించి వినిపించారు రేపల్లె అలశ్రీ.

'అవసరాలు' కవితలో 'మనింట్లో మనమున్నామనే నిశ్చింతకై తెలంగాణ' అని ఒక్క మాటలో తేల్చిచెప్పిన కవయిత్రి షహనాజ్ ఫాతిమా 'కెరటాలు' కవితా సంపుటి 2004లో '....'(నానీలు) 2006లో - 'చెలిమి' కవితా సంపుటి 2007 వెలువరించారు.

'ఆత్మగల్ల తల్లి....' కవితలో 'ఆత్మగౌరవం జాతిపౌరుషం పాండిత్యం పరిశోధక నైజం / నిత్య సాహిత్య సేద్యం / మన తెలంగాణ భాషా సాంస్కృతిక పతాకం నీవు' అంటూ ఆచార్య యశోదారెడ్డిని ప్రస్తుతించిన ప్రముఖ రచయిత్రి అనిశెట్టి రజిత 10కి పైగా కవితలు, నానీల సంపుటిలు వెలువరించారు. గులాబీలు జ్వలిస్తున్నాయి, నేనొక నల్ల మచ్చనా, చెమటచెట్టు, ఉసురు, గోరంతదీపాలు, దస్తకత్, మట్టిబంధం, నన్హే నన్హే, మార్కెట్ స్మార్ట్ శ్రీమతి మొదలయినవి వీరి ప్రచురించిన పుస్తకాలు.

వసంత సుబ్రహ్మణ్యం రాసిన 'ఆనాటి అందాలు' కవితలో 'పూరిగుడిసె అయినా ఓ పూలమొక్కతో తులసి మొక్కతో ఉండేది /

దునియా వికృత రూపంతో / కాళరాత్రిగా మారి మరు జన్మ ఎత్తుతుంది' అంటూ పారిశ్రామికాభివృద్ధి చేతి వృత్తులను అణిచి వేసి తద్వారా తెలంగాణ సంస్కృతినీ, పర్యావరణాన్నీ నాశనం చేసిన విధానాన్ని చెప్పారు.

'ఆ రోజుల కోసం' కవితలో కిరణ్‌బాల 'మనం సాధించుకున్న మన చరిత్ర కథల్ని / మన పిల్లలకు సందేశాలుగా వినిపించే / ఆ రోజుల కోసం పోరాడుదాం / పోరాడి సాధిద్దాం రండి రండి' అంటూ 'ఆత్మహత్యలొద్దు! బతికుండి సాధిద్దాం' అని ధైర్యం చెప్పారు.

'ఉద్యమం ఉప్పెనగా లేస్తే...' అనే కవితలో డా॥ తెన్నేటి సుధ 'ఉదయం ఉప్పెనగా లేస్తే / ఏ ఆనకట్ట ఆగదు... / ప్రపంచ పటంపై మహిళా శక్తి స్వరూపిణిగా నిలుస్తుంది' అంటూ నిరూపించారు. వీరు 'వినిపించని వేదన, రవళి, అరవింద' అనే కథల సంపుటులు, 'ఉదయకాంత' అనే కవితా సంపుటి ప్రచురించారు.

'ఎదురుచూస్తూ' కవిత తెలంగాణ మాట లేకుండా రాసారు స్వాతి శ్రీపాద. వీరు 'మౌనవీణ, మనసుకు చూపుంటే, హృదయంలో అడుగులు' అనే మూడు కవితా సంపుటాలు వెలువరించారు. ఆంగ్లంలోకి అనువాదాలు చేస్తున్నారు.

'ఏది నా తెలంగాణ?' కవితా రచయిత్రి తమ్మెర రాధిక 'ఒడ్ల గుమ్ములు వలసలు బోతున్నయి / కురాటి కుండలు చిట్లి పోతున్నయి' అంటూ తెలంగాణ పరిస్థితిని కంటి ముందు చిత్రించారు. వీరి రచనలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి, 'మనోనేత్రం' అనే కవితా సంపుటిని ప్రచురించారు.

'ఒక పోరాటం వేలవేల గాయాలు' కవితలో శైలజా మిత్ర 'సూర్యుడు ఓడిపోడం ఎంత నిజం / మేం మందలంకాదు / చైతన్య సమూహాలం' అంటూ - తెలంగాణ ఉద్యమాన్ని గురించి చక్కగా చెప్పారు. వీరు వివిధ పత్రికల్లో వ్యాసాలు, సమీక్షలు, కవితలతో పాటు ఆంగ్లానువాదాలు కూడా చేస్తున్నారు. వీరు శంఖారావం, మనోనేత్రం, నిశ్శబ్దం, అంతర్మథనవేళ, సిల్వర్‌లైన్స్ కవితా సంపుటాలు, 'తరంగాలు' అనే కథా సంపుటి వెలువరించారు.

ప్రముఖ రచయిత్రి 'గీతాంజలి' తమ కవిత 'కనిపించని గొడ్డలి-



మాయమైన చెట్టు' శీర్షికతోనే ఝలక్ ఇచ్చారు 'చెట్టుకొమ్మలతో రెమ్మలతో తలబాదుకుంటూ / భోరు భోరున ఏడ్చిందనీ / చెట్టు, రైతు, భూమి ఒకటన్న నినాదాన్ని విప్లవించిందనీ' పోలేపల్లి గ్రామ సంఘటనను వివరించారు. ప్రతీచోట చెట్లు నరకబడి మోడులా మిగులుతున్న తెలంగాణ ప్రజాజీవన దృశ్యాన్ని చూపించారు. వీరి రచనలు - 'ఆమె అడవిని జయించింది (నవల) బచ్చేదాని (కథా సంపుటి) పహచాన్ (కథాసంపుటి) నేను పోలేపల్లి పీనుగును మాట్లాడుతున్నా' కథా సంపుటి ప్రచురించారు.

రజనీవుడ్ 'కలాలు వారెవ్వా' కవితలో 'దొంగ దొరలను గద్దెపై బిఠాయించి / కనీసం కారణం తెలుసుకోలేని కలాలూ / మీ సాహస సామర్థ్యాలు వారెవ్వా' అంటూ కలాలను విమర్శించారు. కలాలు పట్టిన వారికి ఎవరో బాధ్యత బోధిస్తేనో కలాలు పట్టుకోలేదు. సామాజిక బాధ్యతగా తమకుతాము ఒక ప్రత్యేకమైన బరువును భుజాలకెత్తుకున్నారు, అయితే మనుషులందరూ మంచివారుకానట్టే ఈ కలాలకూ మినహాయింపు లేదు. కొందరిస్వార్థం అందరినీ ప్రశ్న ముందు నిలబెడుతుంది.

'కాకతీయుల ప్రతాపం - సమ్మక్క సారక్కల శౌర్యం' అనే కవితలో డా॥ లావణ్య 'మేటిదైన మేడ రాజ్యం / వనచరుల సామ్రాజ్యం / ఉర్వి జ్ఞాన శిలురకు / ఉజ్జ్వలఖ్యాతి ప్రకాశం' అంటూ తెలంగాణా వనితా వీరత్వాన్ని వర్ణించారు.. ఆర్య సమాజం - మహిళాభ్యుదయం, శివప్రసాద్ చారిత్రిక నవల అనుశీలత అనే పరిశోధక గ్రంథాలు వీరి రచనలు.

'కాటి సుంకం' కవితలో కొండెపూడి నిర్మల తెలంగాణ ప్రజలు అనుభవించిన దోపిడి, అణిచివేతలను చక్కగా చిత్రీకరించారు. వీరు 'సందిగ్ధ సంధ్య, నడిచే గాయాల బాధాసప్తపది, మల్టీనేషనల్ ముద్దు' అనే కవితా సంపుటులు, 'శత్రుస్పర్శ' అనే కథాసంకలనం ప్రచురించారు.

'కాలజ్ఞానం' కవితలో గోగుశ్యామల 'పాతాళానికి తోసిన జీవజాడలను/ కాగడాలకెత్తుతున్నయి/ సంసారాలను ఎడబాపిన వలసపాలన వద్దని / తెగేసి చెపుతున్న తెలంగాణ కోడలు పిల్ల' అంటూ తన తెలంగాణ ఆకాంక్షను వ్యక్తపరిచారు. వీరు ప్రచురించిన కథా సంకలనాలు 'నల్ల పొద్దు, నల్ల రేగడి సాళ్ళు, ఎల్లమ్మలు.'

'గచ్చపొదల చిచ్చు...' కవితలో జ్వలిత - ఓర్పుమాలిన అధికారాన్ని

ఢిల్లీ అత్తతో పోలుస్తూ, తెలంగాణా వాదాన్ని ముసుగేసుకొని వలసవాదులకు సహకరిస్తున్న వారిని మోసకారి చంద్రులతో పోల్చి రాహువులై మింగాలని ఉసి గొలిపారు. జ్వలిత ప్రచురించిన పుస్తకాలు 'సుదీర్ఘహత్య, కాలాన్ని జయిస్తూ నేను, పరివ్యాప్త'.

'గత్యంతరం లేదు' కవితలో 'సుదీర్ఘ సంవేదన అనంతరం / కపట నిశ్శబ్దం పగలాలిసిన అవసరాన్ని, తరతరాల మానవీయతను ఖాళీకుండల్లా మోసే / అతి దీన హీన మానవీయి కళేబరాలు' వంటి వాక్యాలు కవయత్రి ఎన్. అరుణ గారి ఆవేదనను వ్యక్త పరుస్తున్నాయి. వీరి రచనలు 'మౌనం మాట్లాడుతోంది, పాటలచెట్టు, అమ్మ ఒక మనిషి, హృదయమే వదనం, సూదీ నా జీవనసూత్రం' వంటి అయిదు కవితా సంపుటులు 'గుప్పెడు గింజలు' నానీల సంపుటి ప్రచురించారు.

'గోగుపువ్వు' అనే కవితలో అయిరిని - బయిరిని చేసే తనం/ తెల్లగోలు కావాల్సే... ఉంది / వంటి తెలంగాణ పద బందాలతో రాజకీయ శక్తులు తెలంగాణకు చేసే అన్యాయాన్ని చెప్తూ 'మట్టి ఎర్రదనంలో పోరాట స్ఫూర్తిని గోగుపువ్వులో చూపడం కొత్త అభివ్యక్తి. వీరి 'చలనం' కవితాసంపుటి 2004లో వెలువడింది.

'జీవన తత్వం' - కవితలో శిలాలోలితగారు 'దిశానిర్దేశం చేసే ఆధునిక స్థిత ప్రజ్ఞులు స్త్రీలు / హిమాలయాల మానసిక శక్తితో / అనుభవాల ఇంధనంతో / బతుకు బాటల పల్లేరు కాయల్ని ఏరి పారేసి / కొత్త బాటలు సృష్టించుకునే శిల్పులు' అంటూ స్త్రీల మనోధైర్యాన్ని వివరిస్తారు. వీరి రచనలు 'పంజరాన్ని నేనే పక్షిని నేనే', 'ఎంతెంత దూరం' కవితాసంపుటులు, కవిత్వంలో కవయిత్రుల మనోభావాలు తదితర పరిశోధక గ్రంధాలు వ్రాసారు.

'తెగించి కొట్లాడుడే' అనే కవితలో డా॥ తిరునగరి దేవకీ దేవి వలస కూలీల కబ్జా పెత్తందారీతనంలో/ అంగట్లో పిల్లల నమ్ముకుంటున్నదాన్ని/ కాగితబ్బతుకమ్మే దిక్కైన దాన్ని / అపర కాళినై తెగించి / కొట్లాడుడే తెలంగాణా వచ్చేదాకా' అన్నారు. డా॥ తిరునగరి దేవకిదేవి గారు 1969లో మొదటి తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్న రచయిత్రి. 'తెలంగాణ విమోచనోద్యమ నవలల్లో స్త్రీ చైతన్యం' అనే పరిశోధనా గ్రంధం, 'బతకమ్మ పాటలో స్త్రీ మనోభావాలు' అనే వ్యాస సంపుటి వీరి ఇతర రచనలు.



'తెలంగాణ తల్లి ఎత' కవితలో 'తెలంగాణా గడ్డమీది / పులి బిడ్డలం మేం / తెలంగాణ తల్లి ఎత / తీరేదాకా పోరాడుతం' అన్నారు డా॥ అడువాల సుజాత.

'తెలంగాణ పండుగొచ్చింది' కవితలో పెద్దమ్మ తల్లి రక్షణ ఊరికి ఊపిరి/ మైసమ్మ తల్లి శక్తి యువతకు యుక్తి / ఆయా తెలంగాణ పండుగలను, తెలంగాణ గ్రామ దేవతలను సంస్కృతీ సంప్రదాయాలను సవివరంగా కవిత్వీకరించారు డా॥ వి. త్రివేణి.

'దప్పు సప్పుల్లతో...' కవితలో కవయిత్రి జూపాక సుభద్ర 'తుపాకులు బట్టి తూటాలు తొడుక్కుని' అంటూ నాటి తెలంగాణ సాయుధ పోరాటాన్ని, ఏనాడు కడుపు నిండదిని కండ్లార కునుకు దీయలే / ఛత్ నీయమ్మ విడదీస్తున్నరు / సమైక్య రాగాలు రాజేస్తుండ్రు/ నానెత్తి నిండా పోరాటాల పొక్కలి తొక్కిడున్నది / అయినా నావూర్లన్నీ వుపాసాలె వుంటున్నయి' అనే వాక్యాలు కొంటరు ఉద్యమాలని, ఆకలి కడుపుల గోసను కంటి ముందు దృశ్యమానం చేశాయి. వీరి కవితా సంపుటి 'అయ్యయ్యో దమ్మక్క' అందరి నోళ్ళల్లో నానుతూనే వుంది.

'నాక్కాత్త గీరే...' అనే కవితలో రచయిత్రి జి. విజయలక్ష్మి 'మా బతుకుల్ని నవిలి మింగేప్పుడు / కొరివి దెయ్యాల పూనకాలతో/ మీరంతా ఊగేప్పుడు / ఏప మండనవుతా' అంటూ తమను అణిచివేసే వలసవాదులపై ఎలా తిరగబడాలో చెప్పారు. వీరి కవితా సంకలనం : చీకట్లో వేగుచుక్క.

'నా తెలంగాణా' అనే కవితలో ప్రొఫెసర్ శోభగారు 'మేఘాలై ఉరుముతుంటే / సింహాలై తరుముతుంటే / సర్కారోడు ఏమి జేత్తడు/ తెలంగాణ ఇచ్చిపోతడు' అని తేల్చి చెప్పారు. గ్రామీణ మహిళాభివృద్ధి-మహిళా జనజీవన సమస్యలు, స్త్రీల జీవిత నమూనాలు, విచారణలో వున్న మహిళా ఖైదీలు, సెక్స్‌వర్కర్ల జీవితాలు, దళిత మహిళల జీవన స్థితిగతులు మొదలైన పదికి పైగా పుస్తకాలు వెలువరించారు!

'నా పల్లె' అనే కవితలో కురిమెండ్ల సృజని ఇప్పుడు నా పల్లె ఇడిసిన ముల్లె అయ్యింది / అని మొదలు పెట్టి, గునుగు గుమ్మడి పూలు, తాటిచెట్లు, గోదారి నీళ్ళు అన్నింటిని కలవరించి' మన రాజ్యం కోసం

పంట కొడవల్లమై / జంగ్ బాట పడదామా' అన్నారు. 'సందేహ మెందుకు? వేట కొడవలైనా పట్టాల్సిందే!' అంటాను నేను! వీరి రచనలు వివిధ పత్రికల్లో, సంకలనాల్లో అచ్చుయినాయి.

టి. లీల 'నిన్ను నువ్వే మార్చుకో' కవితలో స్త్రీలపై జరుగుతున్న అన్యాయాలను చెప్పి స్త్రీ చైతన్యాన్ని పొంది తనను తాను రక్షించుకోవాలని చెప్పారు.

'నేను నగేయాల్ల' అనే కవితలో తుర్లపాటి లక్ష్మి 'మా సదువులు మేం జదువుకుంటం / మా కొలువులు మేం జేసుకుంటం / మా భూములు మాయె' అనితేల్చి చెప్పారు. వీరు 'సూర్యునితో పోటీపడి' కథాసంపుటి, 'తలెత్తి' కవితాసంపుటి ప్రచురించారు.

'పల్లె తల్లి గుండె సప్పుడు' అనే కవితలో హిమజ వలసబోతున్న గ్రామాలు, తల్లడిల్లుతున్న తల్లుల మనోవేదనను ఆవిష్కరించారు 'పైసా పెడ్తే దునియా కనపడ్తాంది / కడుపుల ఎత దించుకుందామంటే / సాయం బట్టేటోల్లు కనబడ్తలేరు / తల్లి పేగు మిమ్ముల తరలి రమ్మని / తండ్లాడుతున్న తల పోత' అంటారు. వీరి 'ఆకాశమల్లె' కవితా సంపుటి సుశీలా నారాయణరెడ్డి పురస్కారాన్ని అందుకుంది. మన భూమి పత్రికలో 'హిమ శకలం' పేరున శీర్షిక నిర్వహించారు. వివిధ పత్రికలో కవితలు, వ్యాసాలూ అచ్చుయ్యాయి.

'బుక్కెడు బువ్వ గుక్కెడు నీళ్ళు...' కవితలో 'తాయమ్మ కథల' రచయిత్రి 'తెలంగాణ రావాలి / తెలంగాణ సపరేట్ కావాలి / కళ్ళముందర కడుపుల పుట్టినోళ్ళు / సెట్టుకోడు పుట్టకోడు ఆయె / నాబిడ్డకు బుక్కెడు బువ్వ దొరకాలంటే / తెలంగాణ రావాలే' అని తేల్చిచెప్పారు. కథారచయిత్రి కరుణ కవితలు దాదాపు 15 వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి.

'మన తెలంగాణ' అనే కవితలో నెల్లుట్ల రమాదేవి తెలంగాణా ప్రాచీన వైభవాన్ని, పుణ్యక్షేత్రాలను, కవులను, నదులను, ఆటపాటలను చక్కగా అభివర్ణించి, తెలంగాణ గతమంతా ఘనమైన చరిత / నేటి యువత ఎగరేయాలి మళ్లీ కీర్తి పతాక' అంటారు. వీరి 'మనసు భాష' కవితా సంపుటి సుశీలా నారాయణరెడ్డి పురస్కారాన్ని అందుకుంది. వీరి కవితలు,



కథలు, వెయ్యికి పైగా కార్టూన్లు వివిధ పత్రికల్లో అచ్చుయినాయి.

'మా జోలికొస్తే...' కవితలో మేరీకుమారి మాదిగ పల్లెలనుండి చదువులకోసం పట్నం చేరిన విద్యార్థులు తెలంగాణ కోసం పోరాడుతుంటే వారి తల్లి దండ్రుల మానసిక క్షోభను 'అవ్వా! అని పలుకరించక పాయె / గుండె తరుక్కు పోతుంది / తెలంగాణ ప్రత్యేక రాజ్యంలో / కొత్త వెలుగు విరజిమ్ముతడేమో / అది జూడనీకైనా నేను బతికే ఉంటా' వంటి వాక్యాల్లో చక్కగా చెప్పారు. వీరి రచనలు, వ్యాసాలు, కథలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

'మాతృ మూర్తికి నివాళి' అనే కవితలో విజయ దామోదర స్వామి - తెలంగాణ ప్రజలలో ఒకరి కోసం ఒకరు, తల్లి పిల్లల కోసం, పిల్లలు తల్లి కోసం చేసే పరస్పర అన్యోన్యాల పరంపరను వివరించారు.

'రెండు గుర్రాల స్వారీ' కవితలో జ్యోత్స్న - 'ఏనాడొచ్చినా / బతకటానికొచ్చిన సీమ నుండో, కోస్తా నుండో / మరాఠీవాడివో - మార్వాడీవాడివో ఆదరించిన ఈ తల్లి నీకు ఆధారమయ్యింద'ని అందరికీ ఆతిథ్యమిచ్చిన తెలంగాణ తల్లిని గౌరవించమన్నారు. వీరి రచనలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

'లెంకపీట' కవితలో నాంపల్లి సుజాత 'లేగదూడలను లొంగదీసుకున్నందుకు / ప్రాజెక్టులను పక్కదారి పట్టించినందుకు / కోడి పిల్లలం కాదు / కోడె నాగులం మేం' అని తెలంగాణ వదలకపోతే ఏమవుతుందో ఊహించుకోమంటున్నారు! వీరు 'మట్టి నా ఆలాపన' కవితాసంపుటి, 'నెమలీకలు' నానీల సంపుటి వెలువరించారు.

'శల్య రాజకీయాల్ని నమ్మే ఎర్రి బాగులోల్లం కాదు' కవితలో కందాల శోభారాణి 'హైదరాబాదు తెలంగాణ గుండె / కంటినీరు తుడవని జలయజ్ఞం / నీళ్ళు గమ్మిన కళ్ళతోనే తడుపుతున్న / మా రక్తం మరిగిన ఆవేదనల్ని చూస్తున్న' వంటి వాక్యాలు మనసును కదిలిస్తాయి. వీరి రచనలు వివిధ పత్రికల్లో, కవిత సంపుటాల్లో ప్రచురించబడ్డాయి.

'సమరాంగన' కవితలో చాడా లలితాదేవి తమ నరాలనే నారులుగా చేసుకొని 'నారీలోకం చేస్తున్న ధనుష్టంకారం / వనితల గాజుల గలగల/ యమవాహన ఘంటికలు వినిపిస్తాయి' వంటి వాక్యాలు వెంటాడుతాయి.

వీరి వచన కవితలు 'ఆకాశవాణి' ద్వారా ప్రసారమయ్యాయి.

'సావకు బిడ్డా' - రచనలో శారద 'లారీలకు ఈవులిచ్చి / కాలేకడుపులతో/ అగ్గోలె రగిలి పోతుండ్రు / పసిడి పండె భూతల్లి / నెర్రెలిచ్చింది / మర్లించకున్న మా నీళ్ళే / మిమ్మల్ని ముంచి / కసి తీర్చుకుంటాయి' అంటూ అనంతపురం వరదలను గుర్తు చేస్తారు. ఆత్మహత్యలొద్దని 'సావకు బిడ్డా' అని ధైర్యం చెప్పారు. 'మనోదర్పణం' వీరి కవితా సంపుటి.

'క్షుద్రదేవత' కవితలో చల్లపల్లి స్వరూపరాణి దళిత స్త్రీలపై జరుగుతున్న అమానుషాలకు అద్దం పట్టారు. 'మంకెనపువ్వు' కవితా సంపుటితో పాటు వీరి కథలు వ్యాసాలు, కవితలు వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

'144 సెక్షన్' కవితలో కొల్లాపురం విమల 'ఎర్రెర్రగ నగుతున్నయి/ వెలిగేటి దీపాలు / మెదులుతున్నై / ఒక్కసారి తాకి చూడు / నీతో ముచ్చటిస్తయి' అంటూ కవితాత్మకంగా సృజనాత్మకతను- ఉద్యమాలను ఏ చట్టాలూ, ప్రభుత్వాలూ అణచలేవని చెప్పారు. వీరి 'ఎ గార్ల్ ఇన్ ద రాక్' (ఎ తెలంగాణ టేల్) ఇండియన్ ఫోక్‌లోర్ జర్నల్‌లో ప్రచురింపబడింది. వీరి కవితలు వివిధ పత్రికల్లో అచ్చయినాయి.

ఇహ ఈ సంకలనంలోని....

**కొత్త కలాలు**




ఈ 'గాయాలే గేయాలై...' కవితా సంపుటిలో అరవై కవితలుంటే అందులో దాదాపు ఇరవై మంది కొత్త కవయిత్రులను పరిచయం చేయడం జరిగింది. వారందరూ మొదటిసారి కలం పట్టినప్పటికీ వారి కవితలను చూస్తే అలా అనిపించదు! ఇందులో అన్ని తెలంగాణ జిల్లాలనుండి వచ్చిన కవితలున్నాయి.



టి. వసంతా వివేక్ రాసిన 'అంత అది - ఇంత ఇది' కవితలో రెండు పేరాలుగా రాసి ఒకటి 'బొజ్జనిండినవాడి తత్వబోధ, రెండవది డొక్కలెండినవాడి ఆత్మక్షోభ' అని ముక్తాయింపు ఇచ్చారు. వేరే కొనసాగింపు లేకుండా చక్కగావుంది కవిత.

'ఆత్మక్షోభ' అనే కవితలో విజయా కిషన్‌రెడ్డి 'చూస్తున్నాం / పదవుల ఆశకు... / తోకలు ముడిచిన తీరును అంటూ ఉద్యమాలను నీరుకార్చే వాళ్ళ గురించి చెప్పారు.

పి. సుజాత 'ఇక తెగతెంపులే' అనే కవితలో 'మీరే మాకు బాకీపడ్డారు/ ఇంత కాలం పీల్చి పిప్పి చేసింది చాలు / తేగేదాకా తెలంగాణాని లాగింది మీరే / ఇక తెగ తెంపులు తప్పవు' అని ఒక్క మాటలో తేల్చేసారు.

నిర్మల ఆంజనేయులు రాసిన 'ఎవరమ్మా' కవిత తెలంగాణ అతివల అలంకారాన్ని, సంప్రదాయనగలను, వస్త్రధారణను వర్ణిస్తూ, ఎవరమ్మా అంటూనే ప్రపంచ పటం మీద తెలంగాణ సంస్కృతిని చిత్రించారు.

సుజాత ముదిరాజ్ 'ఏకాభిప్రాయం' కవితలో తొలిసారి కలం పట్టాను అని చెప్తూనే 'తెలంగాణ మాది - మాదే'నని ఏకాభిప్రాయంతో నినదించారు.

టి. కవితాదివాకర్ తన 'ఒంటె - ఓనరు' కవితలో 'ఇద్దరం కలిసే వుందామంటున్నారు, ఇరుకింట్లో... పాముల మధ్య సహజీవనమా...? బాబోయ్ ఎప్పుడు కాటేస్తాయో తెలియదు' తెలంగాణ ప్రజల పరిస్థితిని ఒక్క మాటలో స్పష్టపరిచారు.

జి. శోభ తన 'ఒడుపుగా పట్టుకో' కవితలో 09.12.2009, 10.12.2009 తేదీలలో కొన్ని గంటల సమయంలో తెలంగాణ ప్రజల ఆలోచనల్లో భావాల్లో కలిగిన నిస్పృహను వివరించారు! పాలకుల పాచికలు ప్రజలను ఎంత గొప్పగా గాయపరిచాయో అవలీలగా చెప్పారు.

దిరిసెన రాసిన 'కలకాదు' కవితలో 'నిజజీవితం చేదు గుళికయినపుడు / ఊహలు హోమియో మాత్రలా' అని మొదలు పెట్టి, 'మృదు మధుర మాతృత్వ లాలనతో / బిడ్డా విముక్తి కలిగించు' అంటూ చక్కగా తెలంగాణ తల్లి మనోభావాలను అభివ్యక్తించారు. అయితే తెలంగాణ తరుణి మృత్యువుకు వెల్‌కమ్ అనదు అనాల్సిన అవసరం లేదు! గుంటనక్కల కండ్లల్ల దుమ్ముకొట్టి జాతి సివంగులమై మనం ఘర్జించాలి.

'కీలెరిగి' కవితలో విజయ 'నిజాల్ని అబద్ధాలుగా / అబద్ధాల్ని నిజాలుగా వక్రీకరిస్తే / టీవీల్ని చూడ్డం మాని రేటింగ్స్ పడగొడతాం!'

అని కుండ బద్దలు కొట్టేసారు.

వి. ప్రభాదేవి 'గబ్బిలాలు' కవితలో సీమాంధ్రుల వలసవాదం తెలంగాణ ప్రజలను ఎంత తియ్యగా దోపిడీ చేసిందో సరళమైన మాటతో చెప్పారు. శ్రీకృష్ణ కమిటీ మీద భారం వేసి 'హే కృష్ణా! నీవైనా చెప్పు న్యాయం' అన్నారు.

కె. విజయలక్ష్మి 'జోకొడ్తారు జాగ్రత్త' అనే కవితలో 'విషపు పురుగులు తేలు, పాములు కాటేస్తే మందుంది, మేక వన్నె పులులు సీమాంధ్ర పాలకుల దోపిడీకి ప్రత్యేక తెలంగాణ ఏర్పడటమే మందు' అని చాలా స్పష్టంగా చెప్పారు.

మారుబడి సుజాత తన కవిత 'తెలంగాణా... నేమెట్టిన గడ్డ'లో 'ప్రత్యేక రాష్ట్రం కోసం చేసే ఉద్యమానికి / ఎక్కడెక్కడో ఉన్నవాళ్ళు / పనిగట్టుకొని అడ్డంకులు సృష్టించడం / ఎంత అమానుషం' అన్నారు ఈ జ్ఞానం అందరికీ ఉంటే బాగుండు. అంతే కాదు, సీమాంధ్రలోనున్న తెలంగాణ అభిమానులు కూడా తమ భావాలను ధైర్యంగా చెప్తే బాగుంటుంది.

ఆర్. సుజాత 'తెలంగాణ పిలుస్తోంది' కవితలో రెండడుగులు వెనకబడ్డా / మూడడుగులు ముందుకే / అడ్డొచ్చిన వాళ్ళను ఆత్మ బలంతో అణగదొక్కాలి' అంటూ చాలా ధైర్యంగా ధైర్యం చెప్పారు.

పి. రాజేశ్వరి 'తెలంగాణ సోదరా' అనే కవితలో 'కాళ్ళు మొక్కు బాంచనంటూ / మోచేతి చీకటి బాధలెందుకు! / మాయాజాలపు మత్స్య యంత్రంగా మరో తరానికి నాందీకాకురా / తెలంగాణ మనదంటూ గళమెత్తి పాడరా' అంటూ తెలంగాణ సోదరులకు మనోధైర్యాన్ని చెప్పారు.

'నా ఇంతజారు' కవితలో శిరీషారాణి ఉయ్యాల పాటలో మూడు ప్రాంతాల పోరాటాన్ని సవతుల పోరుగా అభివర్ణించారు. హైదరాబాదు లేని రాష్ట్రం గుండె లేని శరీరంతో పోల్చారు. వ్యాయామ ఉపాధ్యాయిని పదాలతో వ్యాయామం చేయించారు చూడండి. 'పెయ్యంతున్నగనీ ఉయ్యాలో / గుండె కాయ లేనట్టు ఉయ్యాలో'

సస్య 'నేను మనిషిని కాదా' కవితలో మహిళలపై జరుగుతున్న అత్యాచారాన్ని కళ్ళకి కట్టినట్టు చిత్రించి 'ఆడపిల్లగా పుట్టడమే నేరమా? శాపమా?' అని ప్రశ్నించారు.

'బతకమ్మ - బతకమ్మా కోల్' పాట రచయిత జి. శ్యామల సంప్రదాయ బతకమ్మ పాటలో తెలంగాణ కాంక్షను మేళవించి చెప్పారు. వీరి రచనలు,



వ్యాసాలు, కథలు, వచనకవితలు వివిధ పత్రికలలో, సంకలనాల్లో వెలువడ్డాయి. వీరు బాలల సాహిత్యం కూడా రాస్తున్నారు.

'మాకు తెలుసు' అనే కవితలో అరుకొంతం ఇందిరాదేవి గారు 'మీ తినమరిగినతనం మాకు తెలుసు!' అంటూ 'తిన్న దగ్గర గోతులు తీసేస్వభావం మాకు తెలుసు గనక మిమ్మల్ని నమ్మడంలేదు, మాక్కావలసింది తెలంగాణా మాత్రమే!' అని నొక్కి చెప్పారు.

'శోకించకు' కవితలో అరుణశ్రీ 'అరుంధతీదేవికి / అంబేద్కర్‌కి/ సావిత్రిపూలేకు ఏ రిజర్వేషన్స్ ఉన్నాయ'ని ప్రశ్నిస్తూ మన స్వశక్తికి ప్రాధాన్యత యివ్వాలని సలహా చెప్పారు.

'హిమ్మతి తోని' అనే కవితలో సంగీత రాణి 'మసీద్‌కాడి / ఏప చెట్టు కింద / దినాం మీటింగులు మాకు / జై తెలంగాణా / జైజై తెలంగాణా / అనపట్టిను పక్కపొంటి పోరగాండ్లు / నా గుండె సల్లబడ్డది' అంటూ అన్యాపదేశంగా తెలంగాణా కాంక్ష తీవ్రతను చిత్రీకరించారు.

*మనవి :*

*మరి కొందరి కవయిత్రుల రచనలకు సంబంధించిన వివరాలు సమగ్రంగా సేకరించడంలో విఫలమైనందుకు చింతిస్తున్నాను.*




ఈ కవితా సంకలనానికి సంపాదకులుగా వ్యవహరించిన ముగ్గురు మహిళల గురించి క్లుప్తంగా :

**రాజీవ :**



| | |
|---|---|
| అసలు పేరు | : వై. లక్ష్మి వాసన్ |
| కలం పేరు | : రాజీవ |
| కథా సంపుటులు | : కొత్త నిజం, మనసు మంట |
| నవలలు | : నడుస్తున్న కథ, రాబోవు తరం స్త్రీ |
| కవితా సంపుటులు | : 'Love in one' (free verses in English) కొత్త చిగుళ్లు, రాబందులు, |
| సావనీర్లు | : ఎందరో మహా మహిళలు, వనితల వెలుగు వాకిలి |
| బాలల సావనీర్లు | : రవ్వలు, బాల జ్యోత్స్న |
| సంగీత నృత్య నాటిక | : 'కువైట్ టు ఇండియా' (కువైట్ - ఇరాక్ యుద్ధంలో భారతీయులు పడ్డ కష్టాల గురించి వీడియో & ఆడియో కాసెట్) |
| సంపాదకురాలు | : చంటి కార్డ్ బుల్లె(ట్) టిన్ |

**జ్వలిత :**



| | |
|---|---|
| అసలు పేరు | : విజయ కుమారి దెంచనాల |
| కలంపేరు | : జ్వలిత |
| కవితా సంపుటి | : 'కాలాన్ని జయిస్తూ నేను', 'పరివ్యాప్త', 'సుదీర్ఘ హత్య' 'Murder Prolongare' (ఆంగ్లానువాదం) |

**అమృతలత :**



| | |
|---|---|
| నవల | : 'సృష్టిలో తీయనిది' 1978లో ఆంధ్రజ్యోతి వీక్లీలో సీరియల్, |
| కథా సంపుటి | : 'స్పందన' ఆంధ్రజ్యోతి, స్వాతి, మయూరి వీక్లీలలో ప్రచురితం. |
| నాటికల సంపుటి | : 'స్కూల్ పెట్టి చూడు' ఆంధ్రభూమి వీక్లీలో ప్రచురితం. |
| 'అమృత వర్షిణి' | : 'అమృత్ కిరణ్' పక్ష పత్రికలలో వచ్చిన సంపాదకీయాల సంపుటి. |